శ్రీమతే ఘటికాచలనివాసాయ శ్రీనృసింహాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః



బ్రహ్మకైవర్త పురాణాంతర్గతమైన

# శ్రీఘటికాచల మాహాత్మ్యం

( క్షేత్ర విశేషాలతో )

అనువక్త

"పండితరత్న", వేదాంతవాచస్పతి

ఉ.వే. శ్రీమాన్ డా ॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి

ఉ.వే. మహావిద్వాన్

శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి

**114వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక - 2013**

# శ్రీఘటికాచల మాహాత్మ్యం (క్షేత్రవిశేషాలతో)

అనువక్త - "పండితరత్న", వేదాంతవాచస్పతి
ఉ.వే. శ్రీమాన్ డా ॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి

ప్రతులు : 500

అన్నిహక్కులు : అనువక్తవే

ఆవిష్కరణము : 27-4-2013

సందర్భం : ఉ.వే.మహావిద్వాన్ శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారి 114వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక

ముఖచిత్రం : శ్రీయోగనరసింహస్వామి, షోళింగర్

వేదిక : శ్రీభాష్యకారభవనం, నరసాపురం (ప.గో. జిల్లా).

ఈగ్రంథము, విజయవాడ వాస్తవ్యులు, ఆస్తికులు
శ్రీమతి అనిల, శ్రీమాన్ ఎల్.ఏ. స్వామి దంపతులు
భక్తితో సమర్పించిన ద్రవ్యంతో ముద్రింపబడింది.

ప్రతులకు : 1) శ్రీమాన్ ఇ.ఏ. శింగరాచార్యులు
18-3-58/7, శాంతినగర్, కె.టి.రోడ్, తిరుపతి-7
ఫోన్ : 98850 03420

అక్షరయోజనము: శ్రీచంద్రశేఖర్, తిరుపతి

ముద్రణ : సి.యన్. ప్రింటర్స్, తిరుపతి



# నివేదన

భారద్వాజాబ్ధిచంద్రః సువిమలచరితః శాంతివాత్సల్యమూర్తిః
సో-యం త్రయ్యంతవిద్యావివిధగహననయారణ్యసంచారధీరః ।
జీయాదణ్ణంగరార్యాదిగురుపరిషదా శ్లాఘితః ప్రీతిపూర్వం
శ్రీమాన్ శ్రీశేషసింహః గురుకులతిలకః మాదృశాం భాగధేయమ్ ॥

గత ఐదు సంవత్సరాలుగా నరసాపురంలో శ్రీ ఆదికేశవ ఎమ్బెరుమానార్ స్వామివార్ల కోవెలకు సమీపంలో గల శ్రీభాష్యకార భవనంలో ఉ.వే. మహావిద్వాన్, శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి తిరునక్షత్రోత్సవ సందర్భంగా శ్రీరామానుజ దర్శనప్రచారకసభద్వారా ఉభయవేదాంత పండితసభలు భగవద్భాగతాచార్యమంగళాశాసన బలంతో, ఆత్మీయుల, ఆస్తికుల సహాయసహకారాలతో నిర్వహింపబడిన విషయం అందరికీ తెలిసినదే. ఆ రీతిలోనే ఈ ఏడు కూడా శ్రీమాన్ శేషశింగరాచార్య స్వామివారి తిరునక్షత్రోత్సవ స్మారకంగా ఉభయవేదాంత పండితసభలు ఏప్రియల్ 26వ తేది నుండి ఏప్రియల్ 30వ తేది వరకు జరుగుతున్నవి. ప్రతి సంవత్సరం ఈ ఉభయవేదాంత పండిత సభలు శ్రీ ఆదికేశవ స్వామివారి బ్రహ్మోత్సవాల సమయంలో నిర్వహింపబడుతున్నవి. ఆ సందర్భంగా ప్రతిఏడు ఒక సంప్రదాయ గ్రంథం ఆవిష్కరింపబడడం కూడా జరుగుతున్నది. ఆ క్రమంలో ఈ సంవత్సరం జరుపబడే సభాకార్యక్రమాలలో భాగంగా శ్రీఘటికాచలమాహాత్మ్యం అనే ఈ గ్రంథం ప్రచురింపబడి ఆవిష్కరింపబడుతున్నది. ఈ గ్రంథప్రచురణకు కావలసిన ఆర్థిక సహాయాన్ని అందచేసిన సహృదయులు, ఆస్తికులైన శ్రీమాన్ ఎల్.ఏ. స్వామిగారు అభినందనీయులు. వీరికి ఘటికాచల నివాసియైన శ్రీనరసింహస్వామి, అమృతఫలవల్లి శ్రీ ఆంజనేయస్వామివార్ల దివ్యానుగ్రహం పరిపూర్ణంగా లభించాలని కోరుకొంటున్నాను.

ప్రస్తుత గ్రంథంలో ఆంధ్రీకరింపబడిన శ్రీఘటికాచలమాహాత్మ్యానికి మూలం బ్రహ్మకైవర్తపురాణాంతర్గతమైన, సుమారు 1950 సంస్కృత శ్లోకాల రూపంలోని "శ్రీఘటికాచల మాహాత్మ్యమ్" అనే గ్రంథం. ఈ గ్రంథం ఇప్పటికి సుమారు 100 సంవత్సరాల క్రితం ముద్రింపబడింది. ఇది ఇంతవరకు ఆంధ్రీకరింపబడినట్లుగా తెలియలేదు. అందువల్ల ప్రస్తుతం ముద్రింపబడే ఈ ఆంధ్రానువాదం అపూర్వమని చెప్పవచ్చు. ఇందులో కనిపించే పలు పౌరాణిక

గాథలు శ్రీఘటికాచలంలో వేంచేసి ఉండే శ్రీనరసింహస్వామియొక్క, అమృతఫలవల్లీ అమ్మవారియొక్క, శ్రీఆంజనేయ స్వామి యొక్క వైభవాన్ని, ఆ క్షేత్రంలో గల పలు తీర్థాల మహిమను తెలియ జేస్తున్నవి. ఘటికాచలక్షేత్రానికి షోళింగర్ అనే నామంకూడా ప్రసిద్ధి చెందింది. ఈ క్షేత్రం సుప్రసిద్ధ నరసింహ క్షేత్రాలలో ఒకటి. ఆళ్వార్లు కీర్తించిన 108 శ్రీవైష్ణవ దివ్యదేశాలలో ఒకటిగా లెక్కింపబడుతున్నది. ఇచటి శ్రీయోగనరసింహస్వామి, అమృతఫలవల్లి అమ్మవారు, శ్రీఆంజనేయ స్వామి - మహిమను గల దైవాలుగా ప్రసిద్ధిచెందారు.

ఈ గ్రంథంలో ఘటికాచలానికి సంబంధించిన వివరాలతో పాటు నృసింహ స్వామికి సంబంధించిన కొన్ని స్తోత్రాలు కూడా అనుబంధంగా ముద్రింపబడ్డాయి.

ఈ గ్రంథప్రచురణకు ఆర్థికంగా చేయూతనిచ్చిన విజయవాడ వాస్తవ్యులు, ఆస్తికులు శ్రీమతి ఎల్. అనిల, శ్రీమాన్ ఎల్.వి. స్వామి దంపతులను, వీరిని ఈ కార్యంలో ప్రోత్సహించిన శ్రీమాన్ రవిప్రకాష్ గారిని (నరసాపురం) హార్దికంగా అభినందిస్తున్నాను. శ్రీమాన్ స్వామిగారు కొంతకాలం రైల్వేశాఖలో ఇంజనీరుగా పనిచేసి పదవీ విరమణను చేసి, ప్రస్తుతం మారుతి అసోసియేట్స్ అనే సంస్థలో కన్సల్టింగ్ ఇంజనీర్గా ఉన్నారు. వీరికి శ్రీనరసింహ పవన్ కుమార్, శ్రీ నరసింహ పృధి రంగారావ్ అనే ఇద్దరు కుమారులు. వీరిద్దరూ ఇంజనీర్ విద్యను అభ్యసించిన వారు. శ్రీమాన్ స్వామి షోళింగర్ (ఘటికాచలం) క్షేత్రంపట్ల, అక్కడ వేంచేసి యుండే యోగనరసింహస్వామి, అమృతవల్లి అమ్మవారు, యోగాంజనేయస్వామి పట్ల అంతులేని భక్తిప్రపత్తులను కలవారు. వీరి దైవభక్తి, ఆస్తిక చింతన మరింత అభివృద్ధి కావాలని, వీరి కుటుంబం ఇతోధికమైన శ్రేయస్సును శ్రీయోగనరసింహస్వామి కరుణ వల్ల పొందాలని హృదయపూర్వకంగా కోరుకొంటున్నాను. సహృదయులైన ఆస్తిక పాఠకులు దీనిని ఆదరిస్తారని నమ్ముతున్నాను.

జయతు ఘటికాద్రినాథో జయతుతరా మమృతవల్లీ చ ।
జయతు తమాం భక్తగణః సతతం తద్దివ్యదంపతీశరణః ॥

ఇట్లు, నివేదించు
భాగవత విధేయుడు
ఈ.వి. శింగరాచార్యులు

తిరుపతి
15-4-2013



శ్రీమతే ఘటికాచలనివాసాయ శ్రీనృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణాంతర్గతమైన

# శ్రీఘటికాచల మాహాత్మ్యం

సుధావల్లీపరిష్వంగ సురభీకృతవక్షసే ।
ఘటికాద్రినివాసాయ శ్రీనృసింహాయ మంగళమ్ ॥

ఘటికాచలమాహాత్మ్యం చతుర్ముఖోక్తం విచిత్రగాథాభిః ।
ఆంధ్రీకరోతి భక్త్యా దాసః శ్రీశింగరాచార్యః ॥

అవతారిక : వ్యాసభగవానుడు రచించిన పద్దెనిమిది పురాణాలలో బ్రహ్మకైవర్త పురాణం ఒకటి. ఆ పురాణంలోని ఉత్తరఖండంలో ఘటికాచలమహిమ విస్తృతంగా తెలుపబడింది. పరాశరమహర్షి భృగుమహర్షికి ఘటికాచలమాహాత్మ్యాన్ని తెలిపే రీతిలో దర్శనమిచ్చే ఈక్షేత్రమాహాత్మ్యం 22 అధ్యాయాలలో సుమారు 1950 సంస్కృతశ్లోకాల రూపంలో కన్పిస్తున్నది. ఇందులో ఇంద్రద్యుమ్నుడనే రాజు బ్రహ్మత్వాన్ని, మోక్షాన్ని పొందాలని కోరి ఘటికాచలానికి రావడం, అక్కడ వేంచేసి ఉండే శ్రీయోగనరసింహస్వామి మహిమ, శ్రీయోగాంజనేయ స్వామి మహిమ, అచట ఉండే పలుతీర్థాల గొప్పతనం మొదలైనవి ఇందులో విస్తృతంగా వర్ణింపబడ్డాయి. ఇంద్రద్యుమ్నుడు మోక్షాన్ని పొందిన వృత్తాంతం, శ్రీఘటికాచల నృసింహస్వామి అవతారమహిమకూడా అందంగా తెలుపబడ్డాయి.



## బ్రహ్మను మునులు ప్రశ్నించడం :

బ్రహ్మ తెల్పిన శ్రీవేంకటాచలవైభవాన్ని ఆలకించిన శౌనకాదిమునులు చాలా ఆనందించారు. బ్రహ్మ వేంకటాచలవైభవాన్ని తెలిపే సందర్భంలో ఘటికాచల ప్రస్తావన కూడా వచ్చినందున, ఘటికాచలవైభవాన్ని తెలిసికోవాలనే ఉద్దేశ్యంతో ఆ మునులు బ్రహ్మను - "బ్రహ్మదేవా! మీరు వేంకటాచలవైభవాన్నిగూర్చి మాతో పలికేటపుడు ఘటికాద్రినిగూర్చి, ఇంద్రద్యుమ్నునిగూర్చి ప్రస్తావించారు కదా! ఆ ఇంద్రద్యుమ్నుడు ఎవరు? ఎందుకోసం అతడు ఘటికాచలంపై ఎవరిని గూర్చి తపస్సు చేశాడు? ఏఫలం పొందాడు? ఆ ఘటికాచలం ఎక్కడ ఉన్నది? దాని

గొప్పతనం ఏమి? వీటినిగూర్చి మాకు వివరించాలి" అని జిజ్ఞాసతో వేడారు. బ్రహ్మ అప్పుడు సనకాదిమహర్షులకు ఇంద్రద్యుమ్నుని వృత్తాంతాన్ని ఈ క్రింది విధంగా తెలిపాడు.

శ్రీ నృసింహస్వామి మహిమ : కలియుగారంభంలో ఈలోకంలో పిశాచాల, గ్రహాల బెడదవల్ల జనులు చాలా బాధలను పొందారు. వారిపట్ల కరుణ కల్గిన బ్రహ్మ, ఘటికాద్రిలోని బ్రహ్మతీర్థంలో నృసింహస్వామిని ఉద్దేశించి గొప్ప తపస్సు చేశాడు. నృసింహస్వామి అతనికి ప్రసన్నుడై ప్రత్యక్షమయ్యాడు. నీకేమి వరం కావాలని బ్రహ్మదేవుని అడిగాడు. అపుడు బ్రహ్మ భగవానునితో "దేవా! మారుతి బ్రహ్మ పదవిని పొందాలని తపస్సు చేస్తున్నాడు. నీవు ఆ ప్రయత్నాన్ని అడ్డుకోవాలి. లోకంలోని జనులకు దెయ్యాలవల్ల, పిశాచాలవల్ల ఏవిధమైన ఉపద్రవం కలుగ కుండా సుఖంగా ఉండాలి. ఇదే నేను కోరే వరం" అని అన్నాడు. నృసింహస్వామి బ్రహ్మకు ఆ వరాన్ని అనుగ్రహించి, సృష్టికార్యాన్ని యథాపూర్వంగా నిర్వహించ వలసినదిగా అతనికి తెలిపాడు. తరువాత, తపస్సు చేసే ఆంజనేయునకు శంఖ చక్రాలను అనుగ్రహించి, తనకెదురుగా చిన్నకొండపై వేంచేసి ఉండి, తనను దర్శించవచ్చే భక్తులకు వారి అభీష్టాలను నెరవేర్చమని, ఆ కొండను నిత్యనివాసంగా కల్గి నిలచి ఉండమని ఆజ్ఞాపించాడు. అప్పటినుండి ఘటికాచలానికి వచ్చే భక్తులు దెయ్యాలవల్ల, పిశాచాలవల్ల కలిగే బాధలనుండి విముక్తులై, తమ కోరికలను ఆంజనేయులవల్ల పొంది ఆనందిస్తున్నారు. ఘటికాచలంలో వేంచేసి ఉండే శ్రీనృసింహస్వామిని, ఆంజనేయస్వామిని ఆరాధించే భక్తులు అందఱు అన్ని సంపదలను పొంది సుఖంగా జీవిస్తున్నారు.

## ఇంద్రద్యుమ్నుని వృత్తాంతం

త్రేతాయుగంలో ఇంద్రద్యుమ్నుడనే ప్రభువు ఉత్తరదేశంలోని మధురా నగరాన్ని రాజధానిగా చేసికొని భారతవర్షాన్ని పరిపాలించాడు. అతడు జన్మించే టపుడే భగవానుని ఆయుధాలైన శంఖచక్రాల చిహ్నాలను తన భుజాలపై కలవాడై', గొప్ప విష్ణుభక్తుడై వెలిగాడు. నీతినియమాలను తప్పకుండా రాజ్య పరిపాలనను సాగిస్తూ, రాజ్యంలో ఏ లోటు లేకుండా కాపాడుతూ వచ్చాడు. తగిన వయస్సులో మహాలక్ష్మివంటి అందమైన కన్యకను వివాహమాడాడు. ఇంద్రద్యుమ్నునివలె ఆమెకూడా విష్ణుభక్తురాలు. కొంతకాలానికి వారికి ఒక కుమారుడు కలిగాడు.



ఈ విధంగా శ్రీవైష్ణవసిరితో వెలిగే ఆ ప్రభువు శ్రీహరి నామస్మరణను నిత్యం మఱువ కుండా చేస్తూ, అన్యదేవతాస్మరణ లేకుండా ఉండేవాడు.

ఒకనాడతడు తన కులాచారానుగుణంగా, పరివారం వెంట రాగా, అరణ్యా నికి వేటకోసం పోయాడు. అక్కడ అతడు ఒక అందమైన లేడిని చూచి దానిని వేటాడగోరి దానిని వెంబడించాడు. కాని ఆ లేడి అతనికి చిక్కకుండా పరుగెత్తి అక్కడ ఉండే లేళ్ళ గుంపులో కలసిపోయింది. ధనుర్బాణాలను ధరించి వచ్చిన ఇంద్రద్యుమ్నుని చూచి ఆలేళ్ళ సమూహం బెదరి పోయింది. తాము తినే గడ్డినికూడా నోటినుండి జారవిడుస్తూ భయభ్రాంతమైనది. ఆకస్మాత్తుగా ఆ గుంపులోని ఒకలేడి మానవకంఠస్వరంతో ఆ ప్రభువును ఉద్దేశించి, "రాజా! శ్రీజగన్నాథుని పట్ల నీవు నిజమైన భక్తిని కలవాడవు కావు. మమ్మలను చంపవద్దు. మావల్ల ఎవరికీ ఏ హాని జరుగదు" అని అన్నది. నిజమైన వైష్ణవుడు ఎవరికీ ఏ విధమైన హానిని చేయడుకదా! వైష్ణవుడనే పేరును కలవాడై, తాను చేయదలచిన ఆ అకార్యాన్ని గమనించి ఇంద్రద్యుమ్నుడు సిగ్గుపడ్డాడు. అపుడే అతడు తన రజోగుణాన్ని విడచి, అందఱికి మంచిని చేసే సత్త్వగుణాలను కల్గి ఉండాలని తలచాడు. విల్లంబులను విడచిపెట్టాడు. రాజధానికి తిరిగి వచ్చిన ఇంద్ర ద్యుమ్నుడు రాజ్య పాలన భారాన్ని తన కుమారునకు అప్ప జెప్పి, తాను భార్యతో కలసి శ్రీజగన్నాథ క్షేత్రాన్ని చేరారు.

తరువాత హరిద్వారాన్ని చేరి, అక్కడ శ్రీహరిని నిత్యం ఆరాధిస్తూ తపస్సు చేశాడు. అక్కడునుండి ఇంకొక చోటికి పోయి అక్కడకూడా సదా హరినామ స్మరణను చేస్తూ, అన్యవిషయాన్ని దేనినీ స్మరించకుండా గొప్ప తపస్సును చేశాడు. ఒకనాటి రాత్రి, అతడు నిద్రించేటపుడు "హరి" అని పలుకబోయి పొరబాటుగా "హర" అని అన్నాడు. ఒక గడియ (ఘటికా) కాలంలోనే తాను కైలాసపర్వతంపై శివుని సన్నిధిలో ఉన్నట్లు, తన చుట్టూ ఎన్నో శివలింగాలు ఉన్నట్లు కలలో గమనించి ఆశ్చర్యపడ్డాడు. తన నామస్మరణను ఇంద్రద్యుమ్నుడు చేసినందున అతడు తనవద్దకు వచ్చినట్లు శివుడు అతనికి తెలిపి, అతనికి ప్రేమతో స్వాగతం పలికాడు. హరినామోచ్చారణాన్ని మాత్రమే చేసే విష్ణుభక్తుడైన తాను కైలాసపర్వతానికి ఏవిధంగా వచ్చానని అతడు శివుని ప్రశ్నించాడు. "నారాయణుడు వేఱు, నేను వేఱు కాదు"- అని శివుడు పల్కి, "నీకు కావలసిన వరాన్ని కోరుకో" అని రాజుతో అన్నాడు. అపుడు "నేను అన్ని లౌకిక భోగాలను అనుభవించాను.

నా మనస్సు ఎల్లప్పుడు శ్రీమన్నారాయణుని సేవిస్తూ మోక్షాన్ని పొందాలని కోరుతున్నది. వీలయితే నాకు నీవు మోక్షాన్ని అనుగ్రహించు" అని ఇంద్రద్యుమ్నుడు అన్నాడు. అపుడు శివుడు "శ్రీమన్నారాయణ డొక్కడే మోక్షాన్ని ఇవ్వగలడు. బ్రహ్మతేజస్సును పొందినవారు మోక్షాన్ని పొందవచ్చు అందుకోసం నీవు ప్రయత్నించు"అని అన్నాడు. ఆవిధంగా బ్రహ్మతేజస్సును, మోక్షాన్ని పొంది, ఆనందాన్ని అనుభవించే దారిని తనకు తెలుపమని ఇంద్రద్యుమ్నుడు శివుని వేడగా, అతడు "ఓ రాజా! ఎంతోమంది తాపసులు, పుణ్యాత్ములు ఎల్లప్పుడు స్తుతించే శ్రీమన్నారాయణుడు ప్రహ్లాదునకు అనుగ్రహించి, తరువాత కాలంలో అందఱిని అనుగ్రహించడంకోసం "నరసింహపుర" మనే చోట శ్రీమహాలక్ష్మితో కలసి ఘటికాచలంలో యోగనరసింహమూర్తిగా వేంచేసి ఉన్నాడు. సప్తర్షులు, ఇంద్రుడు మొదలైన దేవతలు, శ్రీకృష్ణద్వైపాయనుడువంటి మహర్షులు ఆ స్వామిని ఆరాధిస్తారు. పౌరాణికులు ఆ పర్వతప్రాంతాన్ని ఘటికా చలమని వ్యవహరిస్తున్నారు. ఆ పర్వత సానువులలో ఋషులు, మునులు తపస్సు చేస్తున్నారు. పుణ్యతీర్థాలు నిండిన ఘటికాచలంపట్ల నా మనస్సు ఎంతో భక్తిని కల్గి ఉన్నది. మోక్షపదవిని, బ్రహ్మతేజస్సును పొందాలని నీవు కోరితే అక్కడకు పోయి తపస్సు చేయి" అని అన్నాడు.

ఇంద్రద్యుమ్నుడు ఘటికాచలాన్ని చేరడం : స్వప్నం ముగిసి మెలకువ వచ్చిన తరువాత ఇంద్రద్యుమ్నుడు కలలో తనకు కల్గిన అనుభవాన్ని ఆశ్చర్యంతో స్మరించాడు. తన భార్యకు జరిగిన సంగతిని తెలిపి, ఆలస్యం చేయకుండా వెంటనే ఆమెతో కలసి ఘటికాచలానికి ప్రయాణమయ్యాడు. అతడు హిమాచలప్రాంతాల నుండి దక్షిణ దిశగా ప్రయాణించేటపుడు, ఆ దిశనుండి ఆనందంగా ఆకాశ మార్గంలో పయనించే వాలఖిల్యులనే మునులను చూచి, వారికి నమస్కరించాడు. వారు పొందే ఆనందానికి గల కారణాన్ని అతడు ప్రశ్నించగా, ఆ మునులు, తాము ఘటికాచలంలో వేంచేసి ఉండే శ్రీనృసింహస్వామిని సేవించి వస్తున్నట్లు చెప్పారు. అపుడు అతడు ఘటికాచలానికి పోయే దారిని గూర్చి వారిని అడిగాడు.

"హిమాలయపర్వతానికి సుమారు తొమ్మిదివందల యోజనాల దూరంలో వేగవతి, పయోష్ణి అనే పేర్లను గల పుణ్యనదికి నైఋతి దిశలో ఘటికాచలం ఉన్నది. ఆ పర్వతశిఖరంపై సప్తర్షులకు, ప్రహ్లాదునకు అనుగ్రహించి నృసింహస్వామి వేంచేసి ఉన్నాడు. ముముక్షువులు, మహాత్ములు ఎల్లప్పుడు ఆ స్వామిని కీర్తిస్తున్నారు.



హనుమత్‌తీర్థంలో స్నానమాడి, సాయంవేళ ఆ శ్రీనృసింహుని సేవించి, ఆ ఆనందంతో మేము తిరిగి వస్తున్నాము. గంగను దాటి శ్రీశైలం, వేంకటాచలం, స్వర్ణముఖి మొదలైనవానిని అతిక్రమించి, ఘటికాచలాన్ని నీవు చేరవచ్చు" - అని వాలఖిల్యులు అతనికి బదులిచ్చి ఉత్తరదిక్కుగా తమ ప్రయాణాన్ని సాగించారు.

వేంకటాచలదర్శనం : వాలఖిల్యమునుల ఆశీస్సును పొందిన ఇంద్ర ద్యుమ్నుడు భార్యాసహితుడై గంగానదిని దాటి, శ్రీశైలపర్వతాన్ని చేరాడు. ఆ పర్వతం నుండి పడమటి దిశగా కిందకు దిగి జ్వాలానృసింహుని (అహోబిలం) సేవించాడు. అక్కడనుండి బయలుదేరి శ్రీవేంకటాచలాన్ని చేరాడు. కపిలతీర్థంలో స్నానమాడి, మెల్లగా వేంకటాచలం పైకి పోయి అక్కడ స్వామిపుష్కరిణిలో స్నానం చేశాడు. శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలైనవారు కొలిచే శ్రీవేంకటేశ్వరుని సేవించి, అక్కడ మూడు దినాల పాటు ఉన్నాడు. ఆ పర్వతంనుండి కిందకు దిగి, సువర్ణ ముఖినదిని చేరి, అక్కడ పెద్ద మఱ్ఱి చెట్టును, దాని కొమ్మలను పట్టుకొని ఉండే సువ్రత, అనువ్రతులనే ఇద్దరు అసురులను చూచి దయతో నిలిచాడు. పరమవైష్ణవుడైన అతనిని చూచిన వెంటనే ఆ అసురులలో ఒకడు తన అసుర రూపాన్ని పోగొట్టుకొని తేజోరూపంతో శ్రీవైష్ణవాకారాన్ని పొంది ఆకాశంలోకి ఎగిశాడు. దీనిని చూచి ఇంద్రద్యుమ్నుడు చాలా ఆశ్చర్యపడ్డాడు. ఇంతలో ఆకాశంనుండి "ఆహా! నరసింహ స్వామిపై వైభవాన్ని ఎవరు ఏవిధంగా వర్ణించగలరు? ఆ స్వామి యొక్క కోనేటిలోని నీటికణ సంబంధంవల్ల ఈ రాక్షసులలో ఒకడు ముక్తిని పొందారు" అనే ఒక గొప్ప అశరీరవాణి విన్పించింది. ఈ విషయాన్ని గూర్చి వివరంగా తెలియగోరిన ఇంద్రద్యుమ్నునకు దగ్గరలో ఉండే ఒక దేవకాంతలలో కొందఱు తాము ఘటికా చలాన్ని సేవించి శిలాపుష్కరిణిలో స్నానం చేసి, శ్రీయోగనరసింహ స్వామిని ఆరాధించి తిరిగి వచ్చేటపుడు తమలో ఒకతె అయిన ఊర్వశియొక్క కేశపాశంనుండి జారి పడిన నీటికణంవల్ల ఆ అసురుడు శాపం తీరి మోక్షాన్ని పొందాడని అన్నారు.

అసురుల వృత్తాంతం : ఈ విధంగా మోక్షాన్ని పొందిన అసురుని పూర్వ వృత్తాంతాన్నిగూర్చి వివరంగా తెలుపవలసినదిగా ప్రార్థించిన ఇంద్రద్యుమ్నునితో దేవకాంతలు మళ్ళీ ఈ విధంగా అన్నారు. "తీర్థాచలమనే చోట సోమవ్రతుడనేవాడు పుత్రప్రాప్తిని కోరి తన భార్య అనసూయతో పాటు పుష్కరక్షేత్రాన్ని చేరి అక్కడ గొప్ప తపస్సును చేశాడు. కొంతకాలానికి అతడు ఇద్దరు పుత్రులను పొందాడు.

వారు జన్మించిన సమయం ఆసుర సమయం కనుక, వారు అసురరూపంతో పుట్టారు. సోమవ్రతుడు తన భార్యతో కలసి అసురభావంతో శృంగారాన్ని చేసినందు వల్ల, ఆ గుణాలను రూపాన్ని కల్గిన పుత్రులను అతడు పొందాడు. బలవంతులైన వారు ఇద్దఱు పుట్టగానే తండ్రిని విడచి అక్కడ ఉండే మఱ్ఱిచెట్టును ఆశ్రయించి జీవిస్తున్నారు. అనువ్రతుడు, సువ్రతులనే ఈ ఇద్దఱిలో, అనువ్రతుడు ఊర్వశి కేశాలనుండి జారిపడిన శిలాపుష్కరిణీజల ప్రభావంవల్ల ముక్తిని పొందగా, అనువ్రతుడు ఇంకా రాక్షసరూపంలోనే నిలచి ఉన్నాడు" - అని ఆ దేవకన్యలు తెలిపారు. ఇంద్రద్యుమ్నుడు ఆ రాక్షసుల వృత్తంతాన్నిగూర్చి ఇంకా వివరంగా వినగోరు తున్నానని అనగా, అతనితో దేవకాంతలు తిరిగి ఈ విధంగా అన్నారు.

"ఈ అనువ్రతుడు, సువ్రతుడు పూర్వజన్మలో పారియాత్రం అనే పర్వత ప్రాంతంలో వేటగాళ్ళుగా జీవించారు. చాలా నైపుణ్యంతో వేటాడగల్గిన వారు ఒకనాడు అరణ్యంలో నిరాశ్రయుడై సంచరించే ఒక మునిని చూచి బాధపడి అతడు నివసించడం కోసం ఒక గుడిసెను నిర్మించారు. మునిప్రవర్తనను తాము కూడా అనుసరించడం ఆరంభించారు. సద్గతిని పొందడానికి తగిన మంత్రోపదేశాన్ని చేయమని ఆ మునిని వారు అర్థించారు. ఆ మునికూడా వారు చేసిన సేవకు చాలా ఆనందించినందువల్ల "మృగ ఏవాహమ్" అనే ఏదో ఒక మాటను వారికి చెప్పి, అక్కడనుండి వేఱొక చోటికి వెళ్ళిపోయాడు. ముని పల్కిన ఆ మాటను సోదరులిద్దరు చాలా విశ్వాసంతో జపిస్తూ వచ్చారు. "మృగ ఏవాహమ్" అనే మంత్రానికి "నేను మృగాన్ని" అని అర్థం. కాని, వారికి ఆ అర్థం తెలియదు.అయితే మంత్రానికి తగినట్లు శ్రద్ధతో జపించినందున తదనుగుణంగా వారు మృగరూపాన్ని పొంది, అరణ్యంలో సంచరించారు. ఒకనాడు తమకు మంత్రోపదేశం చేసిన మునిని చూచి భక్తితో నమస్కరించారు. ముని వారి శ్రద్ధకు, భక్తికి చాలా ఆశ్చర్యపడ్డాడు. వారి మృగరూపాన్ని చూచి, అతనికి వారిపట్ల చాలా జాలి కల్గింది. తన కమండలులోని జలాన్ని వారిపై ప్రోక్షించి, వారి చెవిలో వాసుదేవ మంత్రాన్ని ఉపదేశించాడు. ఘటికా చలానికిపోయి ఏకశిలాపర్వతం చరియలో ఉండే హనుమత్తీర్థంలో స్నానంచేసి, పూర్వరూపాన్ని పొందమని వారికి ఉపదేశించాడు. మృగరూపాన్ని పొందిన ఆ సోదరులిద్దరు మునికి నమస్కరించి ఘటికాచలాన్ని చేరారు. హనుమత్తీర్థంలో స్నానమాడి వాసుదేవమంత్రాన్ని జపించి, తను మృగ రూపాన్ని పోగొట్టుకొని మానవరూపాన్ని తిరిగి పొందారు. అక్కడే నివసించగోరిన ఆ సహోదరులు వాసుదేవమంత్రాన్ని భక్తి శ్రద్ధలతో జపిస్తూ హనుమానుని, శ్రీ



నృసింహస్వామిని మిక్కిలి విశ్వాసంతో ఆరాధించారు. అక్కడి ఒక గుడిసెను నిర్మించుకోవాలని తలచి, దానికి తగినట్లుగా వెదుళ్ళు, ఆకులు మొదలైనవానిని సంపాదించడంకోసం కత్తి మొదలైన సాధనాలతో భైరవముని తపస్సు చేసే ఉత్తర దిక్కువైపు వెళ్ళారు. అక్కడ ఆకాశమంత ఎత్తు ఎదిగిన వెదుళ్ళను చూచారు. అది శిలాపుష్కరిణీ ప్రదేశం. అక్కడ విప్రశేఖరుడనే ముని నివసిస్తున్నాడు. ఆ ముని సంస్కృత ద్రావిడభాషలను తెలిసినవారు. నృసింహమూర్తినే సర్వస్వంగా భావించి ఆరాధించేవాడు. మిక్కిలి పవిత్రమైన ఆ ప్రదేశంలో చాలా కాలంగా పెరిగే వెదుళ్ళను జాలి లేకుండా నఱికిన ఆ కిరాతసహోదరుల కృత్యానికి విప్రశేఖరముని చాలా కోపించాడు. వారి రాక్షసకృత్యానికి ఆ ఇద్దఱిని రాక్షసులు కాగలరని శపించాడు. శాపాన్ని పొందిన వారిరువురిలో సువ్రతుడు పరుగెత్తి పోయి విప్రశేఖరుని పాదాలను పట్టుకొని తనకు క్షమించమని ప్రార్థించాడు. విప్రశేఖరుడు సువ్రతుని భవిష్యత్తును తన జ్ఞాననేత్రంతో చూచి హనుమత్తీర్థమహిమవల్ల అతని రాక్షస రూపం పోయి విష్ణుభక్తుడై విష్ణులోకప్రాప్తిని పొందగలడనే శాపవిమోచనాన్ని పలికాడు. అనువ్రతుడు ఆ మునిని శరణు పొందేలోగా అతడు ఆ చోటును వదలి వెళ్ళిపోయాడు. అందువల్ల అతడుమాత్రం శాపం తీర్చుకోలేకపోయారు" - అని అంటూ దేవకాంతలు పలికారు.

సోమవ్రతుడు మోక్షాన్ని పొందడ :- మాహిష్మతి - అనే నగరంలో సుమతి అనే వర్తకుడు ఉండేవాడు. అతడు తన కులవృత్తిని ధర్మమార్గంలో నిర్వర్తిస్తూ గొప్ప సంపదను, కీర్తిని పొందాడు. అతనికి సురస, విరస అనే భార్యలుండేవారు. వారిలో పెద్ద భార్య అయిన సురసనే అతడు చాలా ఆదరించి, చిన్న భార్య విరసను అనాదరించాడు. విరస మహాపతివ్రత. భర్త తనను నిరాదరించినా, భర్తపట్ల గొప్ప భక్తి విశ్వాసాలను కల్గిఉండేది. ఆ వర్తకునకు అన్ని సంపదలు ఉన్నా, పుత్రసంతాన భాగ్యం మాత్రం కలుగలేదు. అతడు తన ఇద్దఱు భార్యలతో కలసి ఘటికాచలానికి పోయి పలు తీర్థాలలో పుత్రసంతానం కలగాలని కోరుతూ స్నానం చేసాడు. అతని చిన్నభార్యకూడా, అతడు తనను ఎంతగా అనాదరించినా, అతనితో పాటు స్నానమాడి నందున అతని పాపాలు పూర్తిగా తీరిపోయాయి. అతడు ఘటికాచలాన్ని ఎక్కి, శ్రీనృసింహుని భక్తితో సేవించాడు. అతడు ఆ నృసింహుని కరుణ వల్ల బ్రాహ్మణ్యాన్ని పొందాడు. సోమవ్రతుడనే పేరునుకూడా పొందాడు. నృసింహునకు అతడు నమస్కరించి, సత్త్వగుణోద్రేకాన్ని పొంది, చిన్నభార్య విరసవల్ల తనకు ఒక పుత్రుడు కలగాలనే వరాన్ని వేడాడు. కోవెల బయటకు

వచ్చి "నేను నా పెద్ద భార్య సురసను మఱచిపోయి ఏ విధంగా చిన్న భార్యవల్ల పుత్రుడు జన్మించాలని కోరాను" అని రాత్రి అంతా ఆలోచించాడు. మఱునాడు ఉదయం వరప్రదాత అయిన హనుమానుని సన్నిధికి చేరి", తన పెద్దభార్యవల్లనే ఇద్దరు పుత్రులు కలగాలనే వరాన్ని కోరాడు. తన మాటను తానే గర్హించి పల్కినందున అతని పెద్ద భార్యకు ఇద్దరు కుమారులు కలిగారు. కాని, పుట్టిన వెంటనే వారు రాక్షసులుగా మాఱిపోయారు చిన్నభార్యకు దేవవ్రతుడనే ఒక కుమారుడు కలిగాడు. అతని దౌహిత్రుడే (కూతురు కొడుకు) లోకం కీర్తించే ధ్రువుడు. ఈ విధంగా సోమవ్రతుడు ఘటికాచలనారసింహుని కృపవల్లనే బ్రాహ్మణ్యాన్ని పొందాడని తెలిసిన ఇంద్రద్యుమ్నుడు తన భార్యతో ఆ దేవకాంతలను పలు విధాలుగా పొగడి ఘటికాద్రిదిశగా తన ప్రయాణాన్ని కొనసాగించాడు.

దేవేంద్రుని రాక, అతని వేడికోలు :- ఇంద్రద్యుమ్నుడు ఘటికాద్రివైపు ప్రయాణం చేసేటపుడు దారిలో ఇంద్రుని చూచాడు. దేవేంద్రుడు తనను పలు విధాలుగా పొగడడాన్ని గమనించి ఆశ్చర్యపడిన ఇంద్రద్యుమ్నుడు, అతడు తనను వెదకుతూ వచ్చిన కారణాన్ని గూర్చి ప్రశ్నించాడు. అపుడు ఇంద్రుడు తన రాకలో గల కారణాన్ని ఈ విధంగా తెలిపాడు.

"ఇంద్రద్యుమ్న మహారాజా! కాలకేయులనే రాక్షసులు కుంభోదరుడనే వాని నాయకత్వంలో ఈ ఘటికాచల ప్రాంతాన్ని ఆశ్రయించి నివసిస్తూ, ఇక్కడ బ్రాహ్మణులకు, జనానికి చాలా బాధలను కల్గిస్తూ ఉండేవారు. సురథుడనేవాడు ఘటికాచల ప్రాంతాన్ని ధర్మమార్గంలో జనాన్ని రక్షించి పాలనను చేసేవాడు కుంభోదరుడు నృసింహపురాన్ని చేరి, సురథుని అతని భార్యా బిడ్డలతోపాటు ఆ నగరంనుండి అరణ్యానికి తఱిమివేశాడు. అచటి సజ్జనులను పలువిధాలుగా పీడించాడు. మునులను బాధించాడు. యజ్ఞయాగాదులను అడ్డగించాడు. ఆ అసురుల నాయకుడైన కుంభోదరుడు శివునివద్ద గొప్ప వరాలను పొంది, శివభక్తులకు నోటితో చెప్పరాని బాధలను కల్గించాడు. నేను ఇపుడు ఘటికాచలానికి శ్రీనరసింహుని స్తుతించాలని వెళ్ళాను. దుష్కార్యాలను చేసే రాక్షసులను, వారివల్ల బాధలను పడుతూ పరిభ్రమించే జనాన్ని, మునిజనాన్ని చూచి బాధపడ్డాను. భగవానునివద్ద వారిని రక్షించమని మొఱపెట్టాను. మంచివారికి మంగళం కలగాలని స్వామిని వేడాను. ఘటికాద్రినాథుడు ప్రత్యక్షమై "ఇంద్రద్యుమ్నుడనే రాజు మోక్షాన్ని



పొందగోరి నన్ను అన్వేషిస్తూ ఘటికాద్రికి వస్తున్నాడు. అతడు ఈ కాలకేయ రాక్షసులను వధించి, నరసింహపురంలోని జనులు సుఖంగా జీవించేటట్లు చేస్తాడు. అతనికి ఆంజనేయుడు సహాయపడగలడు. వారిద్దరు ఘటికాచలప్రాంతాన్ని రాక్షసుల బారినుండి రక్షిస్తారు" అని పలికాడు. నేను దేవలోకంలో ఉన్నపుడు నారదమహర్షి నాతో నీవు ఘటికాచలానికి రాబోతున్నావని తెలిపాడు. అందువల్ల నరసింహుని ఆజ్ఞను, దేవకార్యాన్ని నెఱవేర్చమని నిన్ను వేడుతున్నాను" అని అంటూ నృసింహ స్వామి ఆజ్ఞను తెల్పి, ఇంద్రద్యుమ్నుని ప్రార్థించాడు. ఇంద్రుని మాటను విని ఇంద్రద్యుమ్నుడు కాలకేయులపట్ల చాలా కోపాన్ని పొందాడు. అయినా, రాజసగుణాన్ని పూర్తిగా విడచి సాత్త్వికగుణాన్నే పూర్తిగా కల్గిన అతడు రాక్షసులతో యుద్ధం చేయడానికి మొదట ఇష్టపడలేదు.

అపుడు ఇంద్రుడు - "ఇంద్రద్యుమ్న మహారాజా! మునులు, దేవతలు, మానవులు సుఖంగా జీవించేటట్లుగా ఘటికాచలాన్ని రాక్షసుల పీడనుండి రక్షించడం నీ బాధ్యతసుమా! నీవు రాజర్షివి. నరసింహస్వామి శంఖచక్రాలను హనుమానునకు ఇచ్చి నీకు సహాయం చేయమని అతనిని ఆజ్ఞాపించాడు. నరసింహపురం రాక్షసబాధ నుండి విముక్తి పొందాలనే ఆశతో దేవతలు, మునులు శిలాతటలంలో కూడిఉన్నారు. అందరి అదృష్టంవల్ల నీవు ఇక్కడిని వచ్చావు. మొదట స్వామి నీకిచ్చిన ఆజ్ఞను నీబాధ్యతగా భావించి నిర్వర్తించు. తరువాత నీవు కోరిన బ్రాహ్మణ్యాన్ని, మోక్షానందాన్ని శ్రీమన్నారాయణుడు తానే స్వయంగా నీకు అనుగ్రహిస్తాడు" అని అంటూ నిర్బంధించి పలికాడు.

## దేవతలు పలు ఆయుధాలను ఇంద్రద్యుమ్నునకు ఇవ్వడం, మునులు ఆశీర్వదించడం

ఇంద్రద్యుమ్నుడు అపుడు కాలకేయరాక్షసులతో యుద్ధాన్ని చేయాలని నిశ్చయించుకొన్నాడు. ఇంద్రుడు, దేవతలు అతనిని పొగడి, అతనికి ఉత్సాహాన్ని కల్గించేటట్లు పలికారు. ఇంద్రుడు ఒక గొప్ప రథాన్ని, వజ్రాయుధాన్ని, అతనికి ఇచ్చాడు. సూర్యుడు రథానికి తెరలను, సారధిని ఇచ్చాడు. దేవతలు తమ బలాన్ని అతనికి ఇచ్చి, పలు అస్త్రాలను కూడా ఇచ్చారు. ఇంద్రద్యుమ్నుడు తన భార్యతో కలసి రథాన్ని ఎక్కి, గొప్ప ఉత్సాహంతో యుద్ధానికి బయలు దేరాడు. మునులు ప్రభువుకు యుద్ధంలో జయం కలగాలని ఆశీర్వదించారు. ఇంద్రద్యుమ్నుడు నరసింహపురాన్ని చేరి, నృసింహస్వామిని మనస్సులో ధ్యానించాడు. దేవతల,

మునుల కార్యాన్ని నెఱవేర్చాలని తలచి వింటిని సంధించి కాలకేయ రాక్షసులను యుద్ధానికి రమ్మని పెద్దగా పిలచి, యుద్ధభేరీలను మోగింపజేశాడు. అంతవరకు ఏనాడు వినని గొప్ప వింటి శబ్దాన్ని విని కాలకేయులు మనస్సులో భీతిల్లారు. వారి శరీరాలు నీరసించాయి. ఏమి జరుగుతుందో! - అని భయపడి తమ నాయకుడు కుంభోదరుని శరణు పొందారు.

## కుంభోదరుని దూతల రాక

కుంభోదరుడుకూడా ఇంద్రద్యుమ్నుని వింటిశబ్దాన్ని విని, అది ఏమో తెలియక తికమకపడ్డాడు. తన శక్తిని తెలియక తనతో పోరాడడానికి సిద్ధపడిన ఇంద్రద్యుమ్నుని చూచి హేళనగా నవ్వాడు. అతడు యుద్ధానికి సిద్ధపడిన కారణాన్ని తెలిసికొని రమ్మని ఖరముఖుడు, దుర్ముఖుడు అనే పేర్లు గల తన సేవకులను ఇద్దఱిని పంపించాడు. వారిద్దరు ఇంద్రద్యుమ్నుని వద్దకు వచ్చారు. ఇంద్రద్యుమ్నుడు గొప్ప సేనతో యుద్ధసన్నద్ధుడై రాక్షసప్రభువుతో పోరాడడానికి సిద్ధమై వచ్చినట్లు వారు గమనించారు. వెంటనే తిరిగివచ్చి ఆ విషయాన్ని కుంభోదరునకు తెలిపారు. యుద్ధం చేయడానికి వచ్చినవాడు ఇంద్రద్యుమ్నుడనే రాజు అని, అతడు దేవతల ప్రేరణతో వారిని సహాయం చేసికొని రాక్షసవర్గాన్ని వధించడంకోసం వచ్చాడని వారు అన్నారు. "శివుడిచ్చిన వరంతో దేవతలుకూడా జయించలేని నన్ను కీటకం వంటి ఒక మానవుడా ఎదిరించదలచాడు?" అని చాలా తక్కువగా పల్కి, తనముందే ఇంద్రద్యుమ్నుని బలాన్ని పొగడుతూ పల్కిన దుర్ముఖుని వచనాలను ఖండించాడు. దుర్ముఖుడు, కుంభోదరుని కోపాన్ని చూచి భయపడి ఆ చోటునుండి తొలగిపోయాడు. కాని, ఖరముఖుడు మాత్రం, "ఇంద్రద్యుమ్నునితో పాటు ఒక వనిత ఉన్నది. అతనిని చంపి, ఆ సుందరిని నీవు పొందవచ్చు. లేక, మోసంతో ఆమెను అపహరిస్తే, ఆ మానవుడు తన ప్రేయసిని కోల్పోయినందున జ్ఞానహీనుడై, నిర్వీర్యుడై ప్రాణాలను విడుస్తాడు" అనే ఉపాయాన్ని పలికాడు. కుంభోదరుడు ఖరముఖుని మాటలను ఆదరించి, తనకు ఎదురుగా ఉండే మంత్రికుమారుల వైపు చూచాడు.

## మంత్రి కుమారులు మరణించారు

కుంభోదరుడు తన మంత్రికుమారులను యుద్ధానికి పంపుతూ శత్రువును జయించి, అతని భార్యను బందీగా చేసి తీసికొనిరమ్మని అన్నాడు. ప్రభువు తమను యుద్ధానికి పంపించినందులకు మంత్రికుమారులు ఏడుగురు సంతోషించి, కుంభోదరునకు నమస్కరించి, ఉత్సాహంతో యుద్ధానికి బయలుదేరారు. అపుడు వారికి దుశ్శకునాలు అనేకం కన్పించాయి. గద్దలు, రాబందులు మొదలైన మాంసాన్ని భక్షించే పక్షులు వారి రథాలపై అప్రదక్షణంగా ఎగిరాయి.

మంత్రికుమారులు ఏడుగురు ఆ దుశ్శకునాలను ఏమాత్రం పట్టించుకోకుండా ధైర్యంగా ఇంద్రద్యుమ్నుని ఎదిరించారు. ఇంద్రద్యుమ్నుడు వింటిని సంధించి వింటినారితో పెద్ద శబ్దాన్ని చేశాడు. ఆ ధ్వనిని విని యుద్ధరంగంలోని రాక్షసుల రథాలకు పూన్చిన అశ్వాలు భయపడి నాల్గు దిక్కులలో పరుగుతీశాయి. రాక్షస వీరుల చేతులనుండి ఆయుధాలు అప్రయత్నంగానే జారిపడ్డాయి. మంత్రికుమారులు ఏమి చేయాలో తోచక నిశ్చేష్టులయ్యారు. కొంతసేపటికి తేరుకొని ఇంద్రద్యుమ్నునిపై పదునైన బాణాలను విడిచారు. ఇంద్రద్యుమ్నుడు క్షణకాలం లోనే వాటిని ఖండించి, మంత్రి కుమారులను ఏడుగురిని అవలీలగా వధించాడు. మిగిలిన రాక్షసవీరులు దానిని చూచి భయంతో పరుగు తీసి కుంభోధరుని కాళ్ళపై పడి జరిగిన విషయాన్ని నివేదించారు. ఇంద్రద్యుమ్నుని దేవతలు ప్రశంసించారు.

## మహామంత్రి రాక, అతని పరాజయం

మంత్రికుమారులు మరణించిన వార్తను విని కుంభోదరుడు మిక్కిలి ఆగ్రహంతో తానే స్వయంగా యుద్ధం చేయడానికి బయలుదేరాడు. అపుడతని దగ్గర ఉండే మహామాత్యుడనే మంత్రి అతని వద్దని పల్కి, తాను యుద్ధాన్ని చేసి ఇంద్రద్యుమ్నుని వధిస్తానని అంటూ, కుంభోదరుని అనుమతితో యుద్ధరంగాన్ని చేరాడు.

కాలకేయులతో జరిగే ఈ పోరులో ఇంద్రద్యుమ్నునకు జయం లభించాలని ఇంద్రుడు ఘటికాద్రినృసింహస్వామిని స్తుతించి ప్రార్థించాడు. ఇంద్రద్యుమ్నునకు సహాయం చేయగల్గినవారిని పంపించమని వేడాడు. అపుడు నృసింహస్వామి ఆంజనేయుని పిలిచి, తన ఆయుధాలైన శంఖచక్రాలను అతనికి ఇచ్చి, ఇంద్రద్యుమ్నునకు సహాయంగా యుద్ధరంగానికి పోయి, రాక్షసులను వధించమని ఆజ్ఞాపించాడు.

కుంభోదరుని అనుమతితో యుద్ధానికి వచ్చిన మహామాత్యుడు గొప్పసేనతో, మహాసంరంభంతో యుద్ధరంగంలో ప్రదేశించాడు. అపుడు దేవతలు, "ఇంద్రద్యుమ్నుడు ఒంటరిగా ఏవిధంగా ఇతనిని, రాక్షసులను గెలువగలడు?"-

అని సందేహించారు. ఆ సమయంలోనే నృసింహస్వామి ఆజ్ఞానుసారం చతుర్భుజుడైన ఆంజనేయుడు ఇంద్రద్యుమ్నునకు సహాయంగా వచ్చాడు.

ఆంజనేయుడు చక్రాయుధాన్ని ధరించి చాలా సంతోషంతో కాలకేయులపై పరాక్రమించాడు. ఆంజనేయునకు అంత సంతోషం కల్గడానికి ఒక కారణం ఉన్నది. ఆంజనేయుడు నృసింహస్వామినిగూర్చి తపస్సు చేసేటపుడు, ఇంద్రుని ప్రార్థనలను అంగీకరించి శ్రీనృసింహస్వామి ఆంజనేయుని ముందు ప్రత్యక్షమై, అభీష్టవరాన్ని కోరుకొమ్మని అన్నాడు. భగవానుని శ్రీచరణాలను ధరించే తాను ఆ స్వామి చిహ్నాలైన శంఖచక్రాలను నిత్యంగా పొంది, కైంకర్యం చేయగోరుతున్నట్లు హనుమానుడు స్వామిని ప్రార్థించాడు. యోగనరసింహస్వామి సంతోషంతో అతనికి శంఖచక్రాలను ఇచ్చి, తన దాసునిగా చేసికోవడమే ఆంజనేయుని సంతోషానికి కారణం. యుద్ధంలో హనుమానుని తాకిడికి రాక్షసవీరులు తాళలేక చెల్లాచెదఱు అయ్యారు. మహామాత్యుడు హనుమానుని ఎదిరించాడు. ఆంజనేయస్వామి అతని రథం ధ్వజంపైకి ఎగిరి దానిని విఱిచి, పడగొట్టాడు. అమాత్యుడు హనుమానునిపై బాణవర్షం కురిపించగా, ఇంద్రద్యుమ్నుడు ఆ బాణాలను అడ్డుకొని, ఒక దివ్యబాణంతో అమాత్యుని కిరీటాన్ని పడగొట్టి వేఱొక బాణంతో అతని వక్షస్సును భేదించాడు. దేవతలు ఇంద్రద్యుమ్నుని పరాక్రమాన్ని ప్రశంసించారు. అపుడు ఒక పెద్ద వృక్షాన్ని పెకలించి అమాత్యుడు ఇంద్రద్యుమ్నునిగా పైకి రాగా, హనుమానుడు అడ్డుకొని, ఆ వృక్షాన్ని తీసికొని దానినే ఆ రాక్షసునిపై విసిరాడు. ఆ దెబ్బకు అతడు నేలకూలాడు. మిగిలిన రాక్షసవీరులు భయంతో పరుగెత్తారు. కొంతమంది కుంభోదరునివద్దకు వచ్చి జరిగిన సంగతిని తెలిపారు.

## కుంభోదరుని కుమారుల రాక, వారి పరాజయం

ఒక వానరంచేత మహాశాస్త్ర (అమాత్యుడు) వధింపబడ్డాడని తెలిసిన కుంభోదరునకు ఆ వార్త నమ్మశక్యం కాలేదు గొప్ప పరాక్రమవంతుడైన అమాత్యుని మరణం అతనిని కుంగదీసింది. అపుడు ధూమ్రాక్షుడు, భీమాక్షుడు అనే అతని కుమారులిద్దరు తాము యుద్ధం చేసి, ఇంద్రద్యుమ్నుని వధిస్తానని పల్కి, అతని అనుమతిని పొందారు. వారిద్దరు అగ్నిని ఉపాసించి, శత్రునిరసనంకోసం యాగాన్ని చేశారు. ఆ యాగఫలంగా గొప్ప బలాన్ని సంపాదించి యుద్ధభూమికి వెళ్ళారు. అపుడు ఎన్నో చెడ్డ శకునాలు వారికి కన్పించాయి. నక్కలు ఊళలు కూశాయి. ఆకాశంనుండి ఇసుక వర్షించింది. సుడిగాలి వీచింది.



కారణం లేకుండానే వారి రథసారథులు రథాలనుండి కిందపడ్డారు. వారు ఈ శకునాలను వేనిని లెక్కించ కుండా యుద్ధరంగాన్ని ప్రవేశించి ఇంద్రద్యుమ్నుని ఎదిరించారు. ఇంద్రద్యుమ్నుడు వారితో పెద్ద యుద్ధం తప్పదని తలచి, జాగరూకతతో పోరాడమని ఆంజనేయునితో పలికి, "నృసింహస్వామి తప్పక మనకు జయాన్ని కల్గించగలడు" అనే విశ్వాసంతో యుద్ధాన్ని ఆరంభించాడు. ధూమ్రాక్షుడు హనుమానుని వధించాలని తలచి పాతాళభేది అనే ఏనుగును ఎక్కి ఆంజనేయుని ముందు నిలచాడు. ఆంజనేయ స్వామి అతనిని భయపెట్టదలచి పెద్దగా ధ్వనిస్తూ ఆ ఏనుగుపై గట్టిగా చఱిచాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక పాతాళభేది గట్టిగా ఘీంకరించింది. ఆ ధ్వని కుంభోదరుని చెవులవరకు వ్యాపించి అతనికి భీతిని కల్గించింది. ధూమ్రాక్షుడు పదునైన బాణాలను ఆంజనేయునిపై ప్రయోగించగా, ఆంజనేయ స్వామి చక్రాయుధంతో వానిని అడ్డుకొని శక్తిహీనాలుగా చేశాడు. ధూమ్రాక్షుడు అపుడు ఆంజనేయునితో తాను ప్రయోగించిబోయే గొప్ప అస్త్రాలను నిరోధించగల్గితే తాను పరాజయాన్ని అంగీకరించి పాతాళలోకానికి వెళ్ళిపోతానని శపథం చేసి, అసమానాలైన బాణాలను ఆంజనేయస్వామిపై ప్రయోగించాడు. ఆంజనేయస్వామి వాటినికూడా అనాయాసంగా అడ్డుకొన్నాడు. తాను ఆంజనేయుని గెల్వలేనని గ్రహించిన ధూమ్రాక్షుడు చటుక్కున అదృశ్యుడై పాతాళానికి వెళ్ళిపోయాడు. అతని తమ్ముడు భీమాక్షుడు తన అన్న కన్పించనందున, అతనిని ఆంజనేయుడే మింగి ఉంటాడని తలచి చాలా కోపంతో ఆంజనేయుని ఎదిరించాడు. నేరుగా యుద్ధం చేసి అతనిని గెలువలేనని గ్రహించిన భీమాక్షుడు ఆకాశంలో అదృశ్యంగా ఉంటూ మాయా యుద్ధాన్ని చేశాడు. అతడు చేసే మాయాయుద్ధాన్ని చూచి దేవతలు కూడా ఆశ్చర్యపడ్డారు. ఆంజనేయస్వామి చాలా మెలకువతో అతడుంటే చోటును గ్రహించి, అతని రెండు కాళ్ళను పట్టుకొని లాగి, గొప్ప బలంతో తిప్పి విసిరివేశాడు. దానితో ఆ రాక్షసుడు చాలా దూరంగా భూమిపై పడి రక్తం కక్కుకొని మరణించాడు. ఆంజనేయుడు యుద్ధంలో పొందిన జయాన్ని చూచి ఇంద్రద్యుమ్నుడు అతనిని అభినందించాడు. దేవతలు ప్రశంసించి పుష్పవర్షాన్ని కురిశారు. దేవదుందుభులు మోగాయి. మునులు సాధువాదాలను చేశారు.

## కుంభోదరుని పరాజయం

తన పుత్రులిద్దరి పరాజయాన్ని విన్న కుంభోదరుడు చాలా బాధపడ్డాడు.

పరమశివుని ఆరాధించి, పలు వరాలను పొంది దేవతలను, మునులను పలు రీతులలో భయపెట్టిన అతడు తనకు చివరి దశ వచ్చిందని గ్రహించాడు. కొంచెం సేపటికి ఊరటను పొంది, ప్రళయకాలాగ్నివలె పైకి లేచాడు. మిక్కిలి కోపంతో యుద్ధరంగాన్ని చేరాడు. ఆ సమయంలో పూర్వంవలె ఎన్నో దుశ్శకునాలు కన్పించాయి. కాని అతడు దానిని లక్ష్యం చేయకుండా యుద్ధభూమిని ప్రవేశించాడు. సాటిలేని మేటి వీరులైన కుంభోదరుడు, ఇంద్రద్యుమ్నుడు ముఖాముఖిగా తలపడ్డారు. ఆ అపూర్వ దృశ్యాన్ని చూడగోరిన దేవతలు ఆకాశంలో గుంపులు గుంపులుగా గుమిగూడారు. ఇంద్రద్యుమ్నుడు గెలవాలని దేవతలు ఆశించారు. మునులు ఆశీర్వదించారు. కుంభోధరుడు ప్రయోగించిన బాణానికి ఇంద్రద్యుమ్నుని విల్లు భగ్నమైనది. రథాశ్వాల కాళ్ళు విఱిగి కూలబడ్డాయి. అపుడు ఇంద్రద్యుమ్నుడు ఇంకొక రథాన్ని క్కి, కుంభోదరుని పరాక్రమాన్ని పొగడి, అతనితో గొప్ప యుద్ధాన్ని చేశాడు. ఇంద్రుడిచ్చిన బాణాలతో, గాంధర్వాస్త్రంతో కుంభోదరుని, అతని సేనలోని వీరులను నిశ్శేషులుగా చేశాడు. తనసేనలోని రాక్షసవీరులు మరణించడం గమనించిన కుంభోదరుడు కోపంతో ఇంద్రద్యుమ్నునిపై ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. ఇంద్రద్యుమ్నుడు దానిని వారుణాస్త్రంతో ఎదుర్కొన్నాడు. కుంభోదరుడు ఇంకా పలు అస్త్రాలను ఇంద్రద్యుమ్నునిపై, ఆంజనేయునిపై ప్రయోగించాడు. వాటిని ఆంజనేయుడు తన చేతిలోని చక్రంతో అడ్డుకొని నశింప జేశాడు. కుంభోదరుడు అతని శక్తికి మెచ్చి పొగడాడు. శివునివల్ల తాను సంపాదించి నిత్యం ఆరాధించే త్రిశూలాయుధాన్ని అతడు గ్రహించి, "మదించిన ఓ వానరమా! నీవు నా వీరులను వధించావు. త్రిపురారి అయిన శివుడు నాకు ఇచ్చిన ఈ త్రిశూలాన్ని నీపై ప్రయోగిస్తున్నాను. శక్తి ఉంటే కాచుకో" అని అంటూ ఆంజనేయుని, ఇంద్రద్యుమ్నుని వధించడంకోసం ఆ ఆయుధాన్ని ప్రయోగించాడు. ఆ త్రిశూలం ప్రళయకాలాగ్నివలె జ్వలిస్తూ అందఱి పైకి వచ్చింది. దాని వేడిమిని సహించలేని దేవతలు, మునులు దూరంగా పరుగెత్తారు. ఇంద్రద్యుమ్నుడుకూడా నిశ్చేష్టుడయ్యాడు. కుంభోదరుడు, శత్రువు నశించాడని భావించి అట్టహాసం చేశాడు. హనుమానుడు అపుడు ఇంద్రద్యుమ్నుని వద్దకుపోయి, త్రిశూలాన్ని జయించగల్గినది నారాయణాస్త్రం ఒక్కటే అని, దానిని ప్రయోగించమని అతనికి గుర్తు చేశాడు. ఇంద్రద్యుమ్నుడు మనస్సును సమాధానం చేసికొని నారాయణాస్త్రాన్ని అభిమంత్రించి లోకకల్యాణార్థంగా త్రిశూలంపై ప్రయోగించాడు. నారాయణాస్త్రాన్ని ఎదిరించడం ఎవరికీ సాధ్యం కాదు. అది అసురులను, రాక్షసు



లను నాశనం చేయగల్గిన అస్త్రం. ఆ అస్త్రం కోటిసూర్యుల ప్రకాశంతో వెల్గుతూ త్రిశూలంపైకి వచ్చి తాకింది. ఆ రెండు ఉత్తమదివ్యాయుధాలు ఒకదానితో ఇంకొకటి తలపడిన దృశ్యం దర్శించడం ఎవరికీ సాధ్యపడనిది. నారాయణాస్త్రం అవలీలగా త్రిశూలంయొక్క శక్తిని నిర్వీర్యం చేసింది. నారాయణాస్త్రం తిరిగి రావడం కొంచెం ఆలస్యం చేసిన క్షణంలో ఇంద్రద్యుమ్నుని మనస్సును తెలిసిన ఆంజనేయ స్వామి చక్రాయుధాన్ని ప్రయోగించాడు. ఆ సుదర్శనప్రభావంవల్ల త్రిశూలం భస్మమైనది. నారాయణాస్త్రం తిరిగి వచ్చి ఇంద్రద్యుమ్నుని అంబులపొదిలోకి చేరింది. చక్రాయుధం ఆంజనేయుని చేరింది. ఇంద్రద్యుమ్నుడు నారాయణాంశ సంభూతుడనే సంగతి అపుడు కుంభోదరునకు తెలిసింది. తన ప్రయత్నాలన్నీ నిష్ఫలం కాగా అతడు సిగ్గుచెంది, అపజయాన్ని అంగీకరించి పాతాళలోకంలోకి (రాక్షససేనలతో పాటుగా) అదృశ్యమయ్యాడు, దేవతలు ఇంద్రద్యుమ్నుని విజయానికి సంతోషించి, పుష్పవృష్టిని వర్షించారు. దేవదుందుభులు మోగాయి. మునుల భయం, బాధ తీరాయి. మళ్ళీ పూర్వంవలె యజ్ఞయాగాదులను చేయసాగారు. లోకం అంతట సుగంధ వాయువులు వీచాయి. మంచి శకునాలు కన్పించాయి.

## ఇంద్రద్యుమ్నుడు రాజ్యపాలన చేయడం

ఘటికాచలప్రాంతంలో క్షోభను కల్గించిన కాలకేయుల బెడద పూర్తిగా తీరేటట్లు చేసిన ఇంద్రద్యుమ్నుని దేవతలు మునులు పొగడారు. ఇంద్రుడతనికి వరాన్ని ఇవ్వగోరాడు. ఇంద్రద్యుమ్నుడు ఇంద్రునకు నమస్కరించి, బ్రహ్మతేజాన్ని పొంది మోక్షపదవిని పొందడమే తన అభిమతమని అన్నాడు. దేవేంద్రుడతనిని కొంతకాలం భూమిపై నిలచి ఉండి ఘటికాచల ప్రాంతాన్ని ప్రజారంజకంగా పాలన చేస్తే, ఘటికాచల స్వామి అనుగ్రహంవల్ల అతని కోరిక తీరగలదని పల్కి, రాజ్యపాలనను చేయమని బలవంతం చేశాడు. దైవాజ్ఞను తిరస్కరించలేని ఇంద్రద్యుమ్నుడు దీనికి అంగీకరించాడు. దేవేంద్రుడు నృసింహస్వామి అనుజ్ఞతో ఇంద్రద్యుమ్నునకు పట్టాభిషేకానికి తగిన సన్నాహాలను చేశాడు. ఇంద్రనగరి అయిన అమరావతితో సమానంగా ఘటికాచలం అలంకరింపబడింది. నాల్గు దిక్కులనుండి పట్టాభిషేక తీర్థం తీసికొని రాబడింది. అందఱు ఆనందించగా ఇంద్రుడు ఇంద్రద్యుమ్నుని తలపై మణికిరీటాన్ని అలంకరించాడు. ఘటికాచల ప్రాంతంలో ఏర్పడిన రాక్షసుల ఉపద్రవాన్ని తీర్చిన హనుమానునకు నమస్కరించి, ఘటికాచలప్రాంతానికి హనుమత్పురి అనే పేరును పెట్టి ఆనందించాడు.

అప్పటినుండి ఘటికాచలం "హనుమత్పురి" అనే పేరుతో కూడా వ్యవహరింప బడుతున్నది. దేవతలు, మునులు తమ కోరిక నెఱవేరినందున ఆనందంతో తమ తమ నివాసాలను చేరారు.

రాజర్షియైన ఇంద్రద్యుమ్నుడు ఇంద్రుని మాటను అనుసరించి హనుమత్పురి అనే ఘటికాచలప్రాంతాన్ని చక్కగా పరిపాలించసాగాడు. అంతవరకు రక్కసుల భీతితో మూలమూలకు పోయి చేరిన అచటి ప్రజలు తమ తమ నివాసాలకు చేరి, సుఖంగా శ్రీయోగనరసింహస్వామి ఆరాధనాదులను నిర్విఘ్నంగా నిర్వర్తించసాగారు. మునులు ఏ అడ్డు లేకుండా తపస్సులను కొనసాగించారు. జీవరాశి అంతా సుఖించింది.

## వశిష్ఠుని ఉపదేశం

ఒకనాడు ఇంద్రద్యుమ్నుడు తన భార్యతోపాటు బంగారు పల్లకిపై ఘటికాద్రి నాథుని సేవించాలని బయలుదేరాడు. శిలాపుష్కరిణి అనబడే కోనేటివద్దకు వెళ్ళాడు. అక్కడ తన కులగురువైన వశిష్ఠుని చూచి అతనికి నమస్కరించి, రాజ్యపాలన పట్ల తనకు ఇక ఆసక్తి లేదని, మోక్షాన్ని పొందడంలో బలమైన ఇచ్ఛ కల్గిందని వినయంగా పల్కి, త్వరగా తాను మోక్షాన్ని పొందే మార్గాన్ని తెలుపమని అతనిని అర్థించాడు. వశిష్ఠమహర్షి తన మాటను భక్తిశ్రద్ధలతో వినమని అతనితో పల్కి, ఘటికాచల క్షేత్రంలోని తీర్థాల మహిమను అచటి శ్రీనృసింహస్వామి కరుణను, విశ్వామిత్ర - వామదేవ - విప్రశేఖరులవంటి వారు శ్రీనరసింహస్వామి కృపవల్ల తమ అభీష్టాలను పొంది, మోక్షాన్ని పొందిన వృత్తాంతాలను విస్తృతంగా తెలిపి, ఆ రీతిలోనే ఇంద్రద్యుమ్నుడు మోక్షాన్ని పొందే ఉపాయాన్ని కూడా తెలిపాడు. **(వాటి వివరం ఇక తెలుపబడుతున్నది)**

## విశ్వామిత్రుని వృత్తాంతం

గాధి అనే ప్రభువు కుమారుడైన విశ్వామిత్రుడు మాయానగరాన్ని పాలించేవాడు. విశ్వామిత్రుడొకనాడు వేటకై అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ అతడు తన పరివారంతో పాటు ఆకలి దాహాలతో బాధపడుతూ యాదృచ్ఛికంగా వశిష్ఠముని ఆశ్రమాన్ని చేరాడు. వశిష్ఠుడు తన ఆశ్రమానికి వచ్చిన విశ్వామిత్రునకు, అతని పరివారానికి ప్రేమతో స్వాగతాన్ని పల్కి తగిన ఆతిథ్యాన్ని ఇవ్వడానికి ప్రయత్నించాడు. వశిష్ఠునివద్ద కామధేనువు అనే దివ్యమైన, కోరిన కోరికలను



ఇవ్వగల గోవు ఉన్నది. దాని సహాయంతో వశిష్ఠమహర్షి విశ్వామిత్రునకు, అతని పరివారానికి తగిన రీతిలో, వారికి తృప్తి కలిగే క్రమంలో విందును అందించాడు. విశ్వామిత్రుడు కామధేనువుప్రభావాన్ని విని, దానిని తాను పొందాలని ఆశపడ్డాడు. వశిష్ఠునకు పలు గోవులను ఇస్తానని, కామధేనువును తనకు ఇమ్మని అతనితో అన్నాడు. విలువైన ఏ వస్తువు అయినా ప్రభువు రక్షణలోనే ఉండడం తగినదని అన్నాడు. అపుడు వశిష్ఠుడు, కామధేనువు వస్తే తీసికొని వెళ్ళవచ్చునని విశ్వామిత్రునితో అన్నాడు. కాని, కామధేనువు వశిష్ఠుని వదలి వెళ్ళడానికి ఇష్టపడ లేదు. దానిని బలాత్కారంగా తీసికొని పోవాలని ప్రయత్నించగా, అది తన కొమ్ములతో, గిట్టలతో రాజభటులను పొడిచి తన్ని, వారిని తరిమి కొట్టింది. అందు వల్ల ఆగ్రహించిన విశ్వామిత్రుడు ఆ కామధేనువుకోసం వశిష్ఠుని ఎదిరించాడు. కాని, వశిష్ఠుని బ్రహ్మతేజస్సుకు అతడు పరాజితుడయ్యాడు. క్షత్రియబలంకంటే బ్రాహ్మణ తేజస్సు అధికమని గ్రహించాడు. ఆ బ్రహ్మతేజస్సును పొంద గోరిన విశ్వామిత్రునకు ఘటికాద్రిని చేరి అచటి నృసింహస్వామిని సేవించి అభీష్టసిద్ధిని పొందమని సూర్యుడు ఉపదేశించాడు. విశ్వామిత్రుడు అదే రీతిలో ఘటికాచల నారసింహుని ఉద్దేశించి తీవ్రమైన తపస్సును చేశాడు. అతని తపస్సును భగ్నం చేయగోరి ఇంద్రుడు అతని ముందు పండ్లతో వెలిగే అయిదు బదరీ (రేగు) చెట్లను సాక్షాత్కరింప జేశాడు. తపఃశక్తితో నిజాన్ని గ్రహించిన విశ్వామిత్రుడు ఆ వృక్షాలలలోని ఫలాలు ఎండిపోయేటట్లు శపించి తన తపస్సు కొనసాగించారు. సూర్యుడు అతనిముందు ప్రత్యక్షమై, లక్ష్మీతీర్థంలో నియమంతో స్నానమాడి సుమంగళీపూజను చేసి, శ్రద్ధతో తపస్సును చేయమని అన్నాడు. విశ్వామిత్రుని తీవ్ర తపస్సుకు భయపడిన దేవతలు బ్రహ్మను పురస్కరించుకొని వచ్చి ఘటికాద్రినృసింహుని కొలిచి, విశ్వామిత్రునకు బ్రహ్మత్వాన్ని అనుగ్రహించమని అర్థించారు. నృసింహ భగవానుడు ఆజ్ఞాపించగా, వశిష్ఠమహర్షి తన నోటితో విశ్వామిత్రుని బ్రహ్మర్షిగా పిలిచారు. విశ్వామిత్రుడు అంతమాత్రంతో తృప్తిపడ కుండా సాలోక్యమోక్షప్రాప్తిని కోరి ఘటికాచలంలో మళ్ళీ తపస్సు చేశాడు. ఘటికాద్రికి మూడు మార్లు ప్రదక్షణం చేశాడు. దానితో నృసింహస్వామి ప్రీతి చెంది అతనికి సాలోక్యాన్ని అనుగ్రహించాడు. ఈరీతిలో విశ్వామిత్రముని బ్రహ్మర్షి పదవిని, సాలోక్యాన్ని ఘటికాద్రిస్వామి అనుగ్రహంతో పొందాడు. విశ్వామిత్రుడు సప్తర్షులలో ఒకడై, ఘటికాద్రీశుని ఆరాధిస్తూ ఉన్నాడు.

## వామదేవవృత్తాంతం

కృతయుగంలో మహాతపస్సు అనే ఒక ముని ఉండేవాడు. అతడు తన పుత్రుడైన వామదేవునకు, తన ఇతరశిష్యులకు వేదవేదాంగాలను యథాక్రమం బోధించాడు. తనకు వేదాన్ని బోధించిన ఆచార్యుడు, తండ్రి అయిన మహాతపస్సుకు గురుదక్షిణగా ఏమి సమర్పించాలి? అని వామదేవుడు అతనినే అడిగాడు, గురుదక్షిణ సమర్పించినపుడే వేదాధ్యయనం పూర్తి కాగలదు. కాని మహాతపస్సు తనకేమీ వద్దని అన్నాడు. రాబోయే ఫాల్గునమాసంలో తన తండ్రి శ్రాద్ధం రాబోతున్నందున, అంతలోగా దేవతల అమృతం లభిస్తే మంచిది - అని అన్నాడు. వామదేవుడు అతని మాట ప్రకారం అమృతాన్ని సంపాదించడంకోసం బయలుదేరాడు. కాని, దానిని పొందే దారి ఏదో తెలియక ఆలోచించాడు. తన తండ్రికి గురువైన అగస్త్యమునిని సేవించి అడిగితే, తనకు తగిన దారి దొరుకగలదని అతడు తలచాడు. అపుడు అగస్త్యుడు బదరికాశ్రమంలో తపస్సు చేసికొంటున్నాడు. వామదేవుడు అక్కడకు పోయి అగస్త్యుని సేవించి, తన తండ్రి చేయబోయే పితృశ్రాద్ధానికి దేవతల అమృతాన్ని సంపాదించి సమర్పించి, గురుదక్షిణను సమర్పించే కర్తవ్యాన్ని పూర్తి చేయాలనే తన అభిప్రాయాన్ని అగస్త్యునకు తెలిపాడు. అమృతాన్ని సంపాదించే ఉపాయాన్ని తెలుపమని ఆ మహర్షిని కోరాడు. అగస్త్యుడు, ఆంజనేయుని ఉపాసించి అమృతాన్ని పొందమని వామదేవునకు ఉపదేశించాడు. ఆంజనేయ స్వామి అమృతాన్ని పొందిన వృత్తాంతాన్ని తెలుపమని అగస్త్యమహర్షిని వామదేవుడు కోరగా, ఆ వృత్తాంతాన్ని అగస్త్యుడు ఈ క్రింది విధంగా తెలిపాడు.

## ఆంజనేయుడు అమృతాన్ని పొందిన వృత్తాంతం

ఒకానొక సమయంలో మందరపర్వతంపై వాయుదేవుడు అంజనాదేవితో కలసి ఆనందించాడు. తత్ఫలంగా ఆంజనేయుడు జన్మించాడు. జన్మించినపుడే అతడు గొప్ప ఆకలితో జన్మించిన నందున అపుడే తూర్పు దిక్కులో ఉదయించే సూర్యుని చూచి దానిమ్మపండు అని భ్రమించి అతనిని అందుకోవాలని ఆకాశంలోకి ఎగిరాడు. దానిని చూచిన దేవతలు ఆశ్చర్యపడ్డారు. సూర్యుడు తనవద్దకు వచ్చిన ఆంజనేయుని తన చేతిలో ఉండే పద్మాలలో ఒక పద్మాన్ని తీసి దానితో అతని స్పృశించి, అతనికి తన వేడిమివల్ల కల్గిన శ్రమను తీర్చాడు. వేదం, వ్యాకరణం మొదలైన విద్యలనన్నిటిని అతనికి ఉపదేశించాడు. అప్పటినుండి హనుమానుడు నవవ్యాకరణ పండితు డయ్యాడు. ఆంజనేయునిపట్ల భక్తని కల్గి



స్తుతించేవారికి అన్ని మంగళాలు కల్గుతాయనే వరాన్ని సూర్యుడు ఇచ్చి,తన చేతిలోని ఒక పద్మాన్ని తీసి అతనికి ఇచ్చి పంపించాడు. ఆంజనేయుడు గొప్ప ఉత్సాహంతో తన నివాసానికి తిరిగి వచ్చాడు. ఇంకొక సమయంలో ఆంజనేయస్వామి బాల్యంలో ఆడుకొనే టప్పుడు, ఆకాశంలో చంద్రుడు ఉదయించాడు. చంద్రుని చూచి అతనిపైకి లంఘించాడు. చంద్రుడతనిపై తన చల్లదనాన్ని ప్రసరింపజేశాడు. ఆ సమయంలో ఆకాశమార్గంలో పయనించే ఇంద్రునితో తనను ఆంజనేయునినుండి రక్షించమని చంద్రుడు వేడాడు. అపుడు ఇంద్రుడు ఆంజనేయునిపై వజ్రాయుధాన్ని ప్రయోగించగా, అది ఆంజనేయుని దవుడకు తగిలి అతడు మూర్ఛపోయాడు. హనుభాగంలో (దవుడలో) దెబ్బతగిలిననందున అతడు హనుమంతుడయ్యాడు. వాయుదేవుడు తన కుమారునకు కల్గిన గాయాన్ని చూచి కోపించి లోకంలో తన సంచారాన్ని నిలిపివేశాడు. వాయుసంచారం లేనందువల్ల లోకాలు తల్లిడిల్లి పోయాయి. అపుడు ఇంద్రుడు, వాయువుని ఓదార్చి, హనుమంతునకు తెలివి వచ్చేటట్లు చేశాడు. చంద్రుడు వాయుపుత్రునకు కానుకగా అమృతాన్ని ఇచ్చాడు. హనుమంతుడపుడు దానిని చంద్రునివద్దనే పెట్టుకొనమని, దాని ఆవశ్యకత వచ్చినపుడు దానిని తీసికొనగలనని అన్నాడు. ఈ విధంగా బాల్యంలోనే అద్భుతలీలలను ప్రదర్శించినవాడు హనుమంతుడు. సూర్యుడతనికి చతుభుజత్వాన్ని, బ్రహ్మచారిత్వాన్ని ప్రసాదించాడు. హనుమానుని ఆరాధించేవారికి అన్ని శుభాలు కల్గుతాయని, అభీష్టాలు సిద్ధిస్తాయనే వరం ఇచ్చాడు.

## ఘటికాచలమహిమ

ఘటికాచలంలో ప్రాచీనాలైన పదునాల్గు శిఖరాలు ఉన్నాయి. ఈ పర్వతం కృతయుగంలో స్వర్ణమయంగా, త్రేతాయుగంలో రజతమయంగా, ద్వాపర యుగంలో తామ్రమయంగా, కలియుగంలో శిలామయంగా సాక్షాత్కరిస్తున్నది. ఏకశిలాపర్వతశిఖరంలో స్వర్ణమయమైన విమానం ఉన్నది. దానికి హేమకోటి విమానమనిపేరు. అందులో శ్రీమన్నారాయణుడు శ్రీనృసింహమూర్తిగా వేంచేసి ఉన్నాడు. హిరణ్యకశిపుని శిక్షించి ప్రహ్లాదుని కాపాడిన నరసింహుడు, అతనికి భయం కల్గించే రూపాన్ని ఉపసంరించుకొని 'యోగనరసింహ స్వామిగా దర్శనమిస్తు న్నాడు. వశిష్ఠుడు, కశ్యపుడు, అత్రి, జమదగ్ని, గౌతముడు, భారద్వాజుడు, విశ్వామిత్రుడు - అనే సప్తర్షులకు ఒక గడియకాలంలో దర్శనమిచ్చినందువల్ల ఆ

పర్వతానికి "ఘటికాద్రి" అనే పేరు వచ్చినది.

ఆంజనేయస్వామి ఈ పర్వతానికి వచ్చి, శంఖచక్రాలకోసం శ్రీనృసింహుని గూర్చి తపస్సు చేశాడు. తన పేరుతో ఘటికాచలప్రాంతంలో ఒక తీర్థాన్ని నిర్మించాడు. దానికి హనుమత్తీర్థమని పేరు. ఔద్దాలికమహర్షి పశుసంపదను కోరి ఘటికాచలంలో తపస్సు చేశాడు. ఆంజనేయస్వామిని స్తుతించాడు. ఔద్దాలికముని చేసిన స్తుతిని విని ఆనందించిన ఆంజనేయస్వామి "నీ అభీష్టవరం ఏమి?" అని అతనిని అడిగాడు. తనకు హనుమద్భక్తి నిశ్చలంగా నిలిచి ఉండాలని ఆ ముని కోరగా ఆ వరాన్ని అతనికి ఆంజనేయస్వామి ప్రసాదించాడు. తరువాత ఔద్దాలికుడు ఘటికాచలప్రాంతంలోని ఒక తీర్థాన్ని చూపి, దానిని చక్రాయుధంతో స్పృశించ వలసినదిగా హనుమానుని అర్థించాడు. హనుమానుడు ఆ విధంగానే చేశాడు. అప్పటినుండి ఆ తీర్థానికి చక్రతీర్థం అని పేరు. ఔద్దాలికముని ఆంజనేయునిగూర్చి చేసిన స్తుతిని పఠిస్తే సకల అభీష్టాలు కల్గి పూర్ణాయుస్సు కల్గుతుంది.

ఘటికాచలం తూర్పు పర్వతశిఖరంలో శ్రీనృసింహస్వామిని ఉద్దేశించి ఆంజనేయస్వామి తపస్సు చేశాడు. ఆ ఆంజనేయస్వామిని కొలిచేవారికి అన్ని శుభాలు కల్గుతాయి. ఆ స్వామి పేరుతో పిలువబడే హనుమత్తీర్థంలో ఆదివారం నాడు స్నానం చేసి, కొలిస్తే ఆ స్వామి దేవామృతాన్ని అనుగ్రహిస్తాడు - అని అంటూ వామదేవునకు అగస్త్యుడు తెలిపాడు. వామదేవుడు ఘటికాచలంలో తాను చేయవలసిన క్రమాన్నిగూర్చి తెలియజేయమని అగస్త్యుని ప్రార్థించగా, ఆ మహర్షి అతనికి ఈవిధంగా మళ్ళీ బదులిచ్చాడు.

ఘటికాచలాన్ని చేరి శ్రీయోగనరసింహస్వామి ఆంజనేయస్వామి అనుగ్రహాన్ని కోరేవారు గిరిప్రదక్షణాన్ని చేయాలి. గిరిప్రదక్షణం మహాప్రదక్షిణమని, ఆంతర ప్రదక్షిణమని రెండు విధాలు. ఘటికాద్రిని చుట్టి వస్తే అంతు లేని శుభాలు కల్గుతాయి. బ్రహ్మతీర్థంలో స్నానమాడి, అగ్నితీర్థం, సోమకుండం, పద్మసరోవరం, వాల్మీకితీర్థం, వజ్రతీర్థం మొదలైనవానిలో స్నానం చేసి, గిరిప్రదక్షిణం చేయడం మహాప్రదక్షిణం అనబడుతుంది. బ్రహ్మతీర్థంలో స్నానం చేసి, భైరవతీర్థం, హలావర్త తీర్థం, వరాహతీర్థం, పుండరీక తీర్థం, గారుడం, పాపవినాశం, అమృతకుండం, వామతీర్థం, రత్నతీర్థం, వశిష్ఠతీర్థం అనే తీర్థాలలోను, లక్ష్మీతీర్థంలోను స్నానమాడి ఘటికాద్రిని ప్రదక్షణం చేయడం ఆంతరప్రదక్షణమనబడుతుంది - అని అగస్త్యుడు



తెలిపాడు.

వామదేవుడు ఆనందంతో ఘటికాద్రిని చేరాడు. హనుమత్ పర్వతంపై ఒక నెల కాలం తపస్సు చేయాలని నిశ్చయించుకొన్నాడు. అగస్త్యుడు పల్కిన రీతిలో రెండు మార్లు ప్రదక్షిణం చేశాడు. హనుమత్తీర్థం ఉత్తరదిశలో చిన్న గుడిసెను నిర్మించుకొని, అక్కడ వేదాధ్యయనం చేసే మునులతో కలిసి హనుమానునిగూర్చి తపస్సు చేశాడు. ఆ విధంగా అతడు తపస్సు చేసే కాలంలో మాఘమాసంలో పౌర్ణమితో కూడిన ఆదివారం వచ్చింది. రాబోయే పంగునిమాసం పౌర్ణమితిథిలోగా అమృతాన్ని సంపాదించి తండ్రికి ఇవ్వగల్గినపుడే తండ్రి కోరిక తీరుతుంది. తాను గురుదక్షిణను సమర్పించినట్లు కాగలదు అనే విషయాన్ని మనస్సులో పెట్టుకొన్న వామదేవుడు ఆదివారంనాడు ప్రాతఃకాలంలో నిద్ర లేచాడు. పవిత్రమైన మనస్సుతో హనుమత్తీ ర్థాన్ని చేరి, మూడు మార్లు అందులో ఆచమనం చేసి, ఆంజనేయుని మనస్సులో నిలుపుకొని, బొడ్డులోతు నీటిలో మునిగి, వేదమంత్రం తెల్పిన రీతిలో ముప్పైమార్లు స్నానమాడాడు. తీరాన్ని చేరి హనుమానునిగూర్చి స్తుతించాడు. వామదేవుడు చేసిన తపస్సుకు ఆంజనేయస్వామి సంతోషించి ప్రసన్నుడయ్యాడు. చంద్రుని వద్దనుండి కలశంతో అమృతాన్ని తీసికొని వచ్చి వామదేవునకు ఇచ్చాడు. వామదేవుడు అమృత కలశాన్ని వినయంగా తన రెండు చేతులతో గ్రహించాడు. హనుమానుని, నృసింహ స్వామిని పలు మార్లు కీర్తించి, వేగంగా తండ్రిని చేరి అమృతకలశాన్ని అతనికి అందజేశాడు. మహాతపస్సు ఆనందంతో పితృశ్రాద్ధాన్ని అమృతంతో నెఱవేర్చడమే కాక, కుమారుని పలుమార్లు ఆశీర్వదించాడు. వామదేవుడు మోక్షాన్ని పొందగోరి ఘటికాచలానికి చేరాడు. యోగనరసింహ స్వామినిగూర్చి తీవ్ర తపస్సును చేసిన వామదేవునకు భగవానుడు గడియకాలంలో మోక్షానందాన్ని ఇచ్చాడు. వామదేవుడు గడియ (ఘటికా) కాలంలోనే మోక్షాన్ని పొందినందువల్లకూడా ఈ క్షేత్రానికి ఘటికాచలమనే పేరు కల్గింది.

## పృథులోముని విష్ణులోకప్రాప్తి

గౌతమహర్షి దౌహిత్రుడు పృథులోముడు. అతడు ఆచార - ఆహార నియమాన్ని కలవాడై విష్ణుసాలోక్యాన్ని పొందాలని ఘటికాచలంలో తీవ్రమైన తపస్సు చేశాడు. శ్రీనృసింహస్వామిని ఎల్లప్పుడు స్తుతిస్తూ, తన భార్యతో పాటు సేవిస్తూ, నృసింహస్వామి కొండకు వెళ్ళే దారిని సంస్కరించి సౌకర్యాలు

కలుగజేయాలని భావించాడు. కొండదారిలో ఉండే చెట్లను, ముళ్ళ తీగలను భార్యతో కలసి కత్తితో ఖండించాడు. శరీరశ్రమను లెక్కించక వారిద్దరు గొప్ప సేవ చేశారు. అక్కడ ఉండే మునులు వారి సేవను గమనించి, కొండకు మెట్లను కట్టే వారిద్దరిని చూచి పొగడారు. పృథులోముడు వారికి నమస్కరించి, "మహాత్ములారా! నాకు నరసింహుడు ప్రసన్నుడయ్యే మార్గాన్ని తెలియజేయండి. వేదమంత్రం, వైదికుల ఆశీస్సు, హరిభక్తి వ్యర్థం కాదు - అని పెద్దలంటారు. ఇది నా విషయంలో యథార్థం కావాలి" అని వినయంగా వేడాడు. మునులు నృసింహస్వామివద్ద ఆ విషయాన్ని విన్నపించగా, స్వామి, పృథులోముడు, అతని భార్య విష్ణుసాలోక్యాన్ని పొందేటట్లు అనుగ్ర హించాడు. ఏ సోమరితనం లేకుండా నమ్మికతో ఘటికాద్రిచరియలలో నివసించే వారికి భగవత్కృపవల్ల అన్ని శుభాలు సమకూరుతాయి. ఆ కైంకర్యాన్ని చేయలేని వారు పృథులోముని చరిత్రను భక్తిలో వింటే శుభాన్ని పొందగలరు.

ఘటికాద్రికి చింతామణి అనే ఇంకొక పేరున్నది. ఘటికాద్రినాథునకు చింతామణీశుడనే నామం దీనివల్ల కల్గింది. శ్రీరాముని పత్ని సీతాదేవిని రాక్షసులు అపహరించిన వార్తను విని భరతుడు, శ్రీరామునకు సహాయపడాలని తలచి, ఘటికాద్రికి వచ్చాడు. భరద్వాజాశ్రమాన్ని చేరిన అతడు సేనలను దూరంగా నిలిపి, తమ్ముడు శత్రుఘ్నునితోపాటు భరద్వాజాశ్రమంలోకి వెళ్ళాడు. దేవకార్యంకోసం అవతరించిన శ్రీరాముడు రావణుని యుద్ధంలో జయించి, సీతతో కలిసి వానర వీరులు వెంట రాగా త్వరగా తిరిగి రాగలడని భారద్వాజమహర్షి భరతునితో పల్కి అతనిని నందిగ్రామానికి తిరిగి వెళ్ళిపొమ్మని అన్నాడు. చాలా దూరం నడచి వచ్చిన శ్రమ తీరడంకోసం భరతునకు, అతని సేనకు ఘటికాద్రీశుని కృపతో చాలా చక్కని విందును ఇచ్చి వారిని ఆనందింపజేశాడు. అరణ్యంలో ఉండే ముని అయిన భరద్వాజుడు నగరంలో నివసించేవారుకూడా ఇవ్వలేని అద్భుతమైన విందును తమకు ఇవ్వడం గమనించిన భరతుడు చాలా ఆశ్చర్యపడ్డాడు. అపుడు ముని భరతుని చూచి, "ఘటికాద్రిశిఖరంపై యోగనరసింహస్వామి వేంచేసి ఉన్నాడు. ఆ పర్వతానికి ఉత్తరంగా ఉండే కల్హారతీర్థంలో శ్రీస్నానం చేసి, కల్హారపుష్కరిణి తీరంలో తపస్సు చేసినవారికి అసాధ్యమైనది ఏదీ లేదు" అని అన్నాడు. భరతుడు భరద్వాజుని వద్ద అనుమతిని తీసుకొని తిరిగి వచ్చేటపుడు దివ్యమైన ఘటికాద్రిపర్వతానికి "చింతామణి" అనే పేరును పెట్టాడు. చింతామణి పర్వతంపై ఉండే స్వామి చింతామణీశుడు కదా! చింతామణిపర్వతానికి తూర్పు దిశలో



నరసింహపురం ఉన్నది. ధర్మాత్ముడైన భరతుడు ఆ ప్రాంతాన్ని చిరకాలం పాలించాడు. ఆ తరువాత ఇంద్రద్యుమ్నుడు - అనే ప్రభువు అయోధ్యను శ్రీరాముడు పాలించినట్లుగా పాలిస్తాడు - అని చెప్పబడింది. నృసింహపురంలో పరమాత్మ "భక్తోచితుడు"(తక్కాన్) అనే నామంతో నిత్యవాసం చేస్తున్నాడు. ఆ స్వామి సకలజనాలను ఆనందింపజేసే ఉత్సవవిశేషాలతో భక్తులను పాలిస్తున్నాడు. పూర్వం సప్తర్షులు ఆ స్వామికి ఉత్సవాలను నిర్వహించి సేవించారు. చైత్రం, వైశాఖం, జ్యేష్ఠం, ఆషాఢం, కార్తికం, మార్గశిరం, ఫాల్గునం నెలలలో ఆ ఉత్సవాలను జరిపారు. పంచబింబాలకు ఇది ఉత్తమమైన ఉత్సవం కనుక, భక్తోచితబింబంలో భగవానుడు ఎల్లప్పుడు ఆనందంతో ప్రకాశిస్తాడు. ఆగమశాస్త్రవిదులైన వైఖానసులు శ్రీనృసింహుని ఆరాధన కోసం నియమింపబడ్డాయి. భక్తోచితస్వామి తనను భక్తితో సేవించేవారికి ఆయుస్సు, విద్య, కీర్తి, మోక్షం మొదలైనవానిని అనుగ్రహిస్తాడు.

## జాంబవతీవృత్తాంతం

ఘటికాద్రిలో హలావర్తమనే ఒక తీర్థం ఉన్నది. దాని సమీపంలో ఒక పెద్ద అరణ్యం ఉండేది. పూర్వం జాంబవంతుడనే భల్లూకపతి అక్కడ ఉండే ఘటికాద్రి నాథుని గూర్చి తపస్సు చేశాడు. అతని పుత్రిక జాంబవతి శ్రీకృష్ణుని వివాహ మాడాలనే ఆశతో కన్యాదశలో గొప్ప తపస్సు చేసింది. అప్పటికి ఆమె వయస్సు ఎనిమిదేండ్లు. అంత చిన్న వయస్సులో ఆమె చేసే తపస్సును చూచి దేవతలు కూడా విస్మయ పడ్డారు. ఒకనాడు ఒక వరాహం ఘటికాచల పర్వతప్రదేశంలోని రెండు తీగలను తన కోరపళ్ళతో తవ్వి, ఒక దుంపను బయటకు తీసింది. అపుడాప్రదేశంనుండి జలజలమని నీటిప్రవాహం పెల్లుబికింది. ఆ వరాహం జాంబవతి దగ్గరకు వచ్చి ఆ దుంపను, తీర్థాన్ని ఇచ్చి, దానిని భుజించి ఆమె ఆకలిని తీర్చుకోమని ప్రేమతో కోరింది. తన చెలికత్తెలు కోరినా అంగీకరించని జాంబవతి ఆ వరాహం చేసిన ఈ పనికి ఆశ్చర్యపడి దాని వైపు ప్రేమగా చూచింది. అంతలో అది మానవకంఠస్వరంలో తన కృతజ్ఞతను తెల్పింది. పూర్వకాలంలో దండక అనే దేశంలో వరాహధ్వజుడనే రాజు ఉండేవాడు. అతని కుమారుడు సింహధ్వజుడు. అతడు యువరాజుగా, తండ్రికి సహాయంగా ఉండేవాడు. అతడు ఒకసారి వేటకోసం అడవికి వెళ్ళాడు. అపుడు దండు అనే మునికోపానికి గురియై వరాహంగా మారిపోయాడు. ఆ సంగతిని తెలిసిన సింహధ్వజుని తండ్రి మునిదగ్గరకు వచ్చి కుమారునకు ఇచ్చిన శాపాన్ని తీర్చమని వేడాడు. దండుముని

"నీ కుమారుడు ఘటికాచలానికి పోయి సంచరించే కాలంలో జాంబవతి అనే ఒక కన్య గొప్ప తపస్సు చేయగలదు. ఆమెకు సేవచేయాలని ప్రయత్నించినపుడు ఆమె ప్రేమతో చూస్తుంది. అప్పుడు నీ కుమారుని వరాహరూపం పోతుంది" అని శాపవిమోచనాన్ని పలికాడు. ఆ సింహధ్వజుడే జాంబవతి చూపుల ప్రభావంవల్ల తన వరాహరూపం తీరి నిజరూపాన్ని పొందాడు. కొంచెం సేపటిలోనే శ్రీమన్నారాయణుడు వరాహ రూపంలో ప్రత్యక్షమై, అతనిని తనలో చేర్చుకొన్నాడు. శ్రీవరాహస్వామి జాంబవతిని చూచి, శ్రీకృష్ణుడుగా తాను అవతరించినపుడు ఆమెను వివాహం చేసికొంటానని పల్కి అదృశ్యమయ్యాడు. జాంబవతి వరాహమూర్తిని స్తుతించి అక్కడ జరిగిన అద్భుత వృత్తాంతాన్ని మనస్సులో పలుమార్లు తలచి తన తండ్రి నివాసాన్ని చేరింది.

వరాహరూపాన్ని పొందిన సింహధ్వజుడు తనకోర పళ్ళతో గుచ్చిన చోట ఉబికి వచ్చిన తీర్థానికి వరాహతీర్థమనే పేరును జాంబవతి పెట్టింది. దానికే వల్లీ తీర్థమని, శిలాపుష్కరిణి అని కూడా పేర్లు ఉన్నాయి. శిలాపుష్కరిణిలో స్నానం చేసేవారికి అంతు లేని శుభాలు లభిస్తాయి. ఉదయం గాని, సాయంకాలం కాని దానిలో స్నానమాడి భగవానుని ధ్యానిస్తే వరాహస్వామిని అనుగ్రహం తప్పక కల్గుతుంది.

## శత్రుంజయవృత్తాంతం

పుణ్యాపురం అనే నగరాన్ని శత్రుంజయుడనే రాజు న్యాయానుసారంగా పాలించేవాడు. అతనికి అన్ని సంపదలు ఉన్నా, పుత్రసంతానభాగ్యం మాత్రం కలుగలేదు. అందువల్ల అతడు మనస్సులో చాలా బాధపడి, తన భార్యతో కలసి కశ్యపమునిని దర్శించి, పుత్రసంతానాన్ని పొందే ఉపాయాన్ని తెలుపమని అతని ప్రార్థించాడు. ఘటికాచలానికి పోయి పుత్రకామేష్టియాగాన్ని చేయమని కశ్యపుడు ఆ రాజుతో చెప్పాడు. ఆ రీతిలో శత్రుంజయుడు తన భార్యతో కలసి ఘటికాచలానికి పోయి, అక్కడ తపస్సు చేసే మునులను సేవించి, వారి అనుమతితో పుత్రకామేష్టి యాగాన్ని చేశాడు. నరసింహస్వామి అనుగ్రహంవల్ల సాటి లేని పుత్రుని పొందాడు. అతడు తన భార్యాబిడ్డలతో చిరకాలం సుఖంగా జీవించి, చివరకు స్వర్గాన్ని చేరాడు.

## పింగళకవృత్తాంతం



పింగళకుడనే వర్తకుడొకడు ఉండేవాడు. అతడు ఐశ్వర్యాన్ని సమృద్ధిగా పొందినా పుత్రసంతతిని పొంద లేనందున అందరిచే నిస్సంతువు (పుత్రహీనుడు) అని నిందింపబడేవాడు. విష్ణుభక్తుడైన అతడు ఆ నిందకు చాలా బాధపడి తన కులగురువైన వరతంతుముని దగ్గరకు పోయి తన మనోవ్యథను గూర్చి అతనికి తెలిపాడు. వరతంతుముని అతనికి సంతానగోపాలమంత్రాన్ని ఉపదేశించి, ఘటికాచలానికి పోయి ఘటికాద్రినాథుని సేవించమని ఆజ్ఞాపించాడు. పింగళుడు ఘటికాద్రికి వచ్చి, పుత్రసంతతిని అర్థించి గోపాలమంత్రాన్ని జపిస్తూ, ఘటికాద్రి నాథుని ఉద్దేశించి గొప్ప తపస్సును చేయడం ఆరంభించాడు. పుణ్యతీర్థాలలో స్నాన మాడి మహాప్రదక్షిణాన్ని, ఆంతరప్రదక్షణాన్ని చేసి, గోపాలమంత్రాన్ని త్రిసంధ్యం (మూడు పొద్దులలో) జపిస్తూ వచ్చాడు. కొంతకాలానికి శ్రియఃపతి (భగవానుని) కరుణవల్ల పుత్రసంతతిని పొంది ఆనందించాడు. భోగాలతో సుఖాన్ని పొందిన పింగళుడు మోక్షానందంలో ఆశను పొంది, వరతంతుముని ఆజ్ఞానుసారం ఘటికాద్రినాథునకు పూలమాలికను కూర్చి సమర్పించే పవిత్రకైంకర్యాన్ని చాలా శ్రద్ధగా చేశాడు. దానధర్మాలను చేస్తూ, భగవద్భక్తులకు తనకు సాధ్యమైనంత సేవలను చేస్తూ ఆనందించేవాడు. భాగవతసమారాధన గొప్పది అని, భగవదారాధనకంటె భాగవతులను ఆరాధించడం మిన్న - అని శాస్త్రాలు తెల్పుతున్నవి కదా! తులసి, సంపెంగ, మల్లె, ఎఱ్ఱకలువ, ఇరువాట్చి మొదలైన పూలను కూర్చి మాలికలను కట్టి తన భార్యతో కలసి, అనన్యభక్తితో శ్రీయోగనరసింహస్వామికి సమర్పించిన అతనిని అందఱు మాలాకారుడని పిలిచేవారు. ఒకనాడు ఆకాశ మార్గంగా వచ్చిన నారదమహర్షి వీణనుండి జారిన ఒక మాల పింగళుని మెడలో పడింది. అది నృసింహస్వామియొక్క, పొందడానికి అరుదైన తులసీమాలిక భగవానుని అనుగ్రహాన్ని ఆ విధంగా పొందిన పింగళుడు అపుడే తన భార్యతో పాటు విష్ణులోకాన్ని పొందాడు.

## ఇంద్రుడు ఇంద్రపదవిని పొందిన వృత్తాంతం

హనుమత్పురిలో సత్యవ్రతుడనే గొప్ప విష్ణుభక్తుడు ఉండేవాడు. అతడు సద్గుణశీలి. సత్ప్రవర్తన కలవాడు. ఇంద్రియనిగ్రహాన్ని కల్గి, తపస్సు చేసే అతడు ఘటికాచలానికి ప్రదక్షణం చేయడం కర్తవ్యంగా భావించాడు. గిరిప్రదక్షిణం చేసిన తరువాతనే మిగిలిన కార్యాలను చేసేవాడు. భాగవతులను, మునిగణాలను దర్శిస్తే సాష్టాంగదండ ప్రణామం చేసేవాడు. ప్రతిదినం ఘటికాద్రిని ఎక్కి భగవానుని

సేవించేవాడు ఒకనాడతడు పర్వతాన్ని ఎక్కేటపుడు అతనికి చాలా అలసట కలిగింది. ఇంద్రుడు (ఇంద్రపదవిని పొందడానికి ముందు) అతని అలసటను తీర్చగోరి విసనకర్రతో అతనికి విసిరాడు. పరమభక్తుడైన అతని శ్రమను తీర్చినందులకు శ్రీనృసింహస్వామి అతనికి దేవతలనాయకుడై ఉండే ఇంద్రపదవిని అనుగ్రహించాడు. ఘటికాచలమహిమను తెలిపే వృత్తాంతాలలో ఇది ఒకటి.

## నిశాకర - హరిదత్త వృత్తాంతం

ఘటికాచలానికి ఉత్తర దిక్కులో నిశాకరుడనే ముని తన భార్యతో పాటు ఆశ్రమాన్ని నిర్మించుకొని తపస్సు చేసేవాడు. అతడు గొప్ప విద్యావంతుడు. చంద్రుని విడచి ఉండని రోహిణీదేవివలె అతని పత్ని అతనిని విడువకుండా సర్వదా అతనికి పరిచర్యను చేయడం గొప్ప భాగ్యంగా భావించి సేవజేసేది. ఆ ముని తన శిష్యులకు వేదాధ్యాపనాన్ని చేసి, యజ్ఞయాగాదులను నిర్వహిస్తూ తపస్సు చేస్తూ ఉండేవాడు. అతని శిష్యులలో ఒకడైన కౌత్సుడు తన ఆచార్యుని, అతని పత్నిని దైవంగా భావించి సేవించేవాడు. అతడొకనాడు అరణ్యంలో తాను చూచిన అద్భుతవృత్తాంతాన్ని నిశాకరమునికి ఈవిధంగా తెలియజేశాడు.

ఆచార్యునకు కందమూలాలను, ఫలాలను సేకరించి తీసికొనిరావడం కోసం ఒకనాడు కౌత్సుడు అరణ్యానికి వెళ్ళాడు. అతడు వాటిని సేకరించిన సమయానికి సాయంకాలం అయినది. అక్కడికి దగ్గరలో ఉండే తీర్థంలో కౌత్సుడు స్నానమాడి, నిత్యకర్మానుష్ఠానాన్ని చేశాడు. అతడు అపుడు ఏ నాడు ఎక్కడా చూడని ఒక చిత్రవర్ణాన్ని కల్గిన ఒక జింక నీరు తాగడంకోసం వచ్చి నీరు తాగి బయటకు వెళ్ళబోయి మిక్కిలి భయంతో కూడిన చూపులతో అఱచింది, చుట్టూ కలియ జూచింది. అపుడు తూర్పు దిక్కులోని పర్వతగుహనుండి భయంకరంగా గర్జిస్తూ ఒక సింహం ఆ మృగం (లేడి) పైకి దూకింది. మృగం భీతిల్లి మూర్ఛపోయి కింద పడిపోయింది. కౌత్సుడు ఆ మృగాన్ని తాకేలోగానే అది అదృశ్యమైనది. ఆ సింహం ఒక రాక్షస రూపాన్ని పొంది కొద్ది సేపటిలోనే జ్యోతిస్స్వరూపాన్ని పొంది, గొప్పగా ప్రకాశించింది. అపుడు ఆకాశంలో సూర్యమండలంవంటి స్వర్ణ మయమైన విమానం కన్పించింది. విష్ణుచిహ్నాలను ధరించిన పలువురు బాలకులు జ్యోతిస్స్వరూపంతో నిలచిన ఒక గంధర్వపురుషునకు ఆదరంతో స్వాగతం పలుకగా, అతడు వారితో విమానం ఎక్కి, అదృశ్యమయ్యాడు. తర్వాత అక్కడ ఇంకేమి కన్పించలేదు. దీనిని చూచిన కౌత్సుని మనస్సు ఆశ్చర్యపడింది. అతడు



ఆశ్రమానికి తిరిగి పోయి, జరిగిన సంగతిని తన గురువుకు తెలిపాడు. కౌత్సుడు తెల్పిన వృత్తాంతాన్ని ఆలకించిన నిశాకరుడు తన జ్ఞానదృష్టితో యథార్థాన్ని గ్రహించాడు. తన శిష్యులతో హరిదత్తుడు శాపవిమోచనాన్ని పొందిన వృత్తాంతమే అరణ్యంలో సంభవించిన అద్భుతదృశ్య మని అన్నాడు. దాని వివరాన్ని అతడు ఈవిధంగా తెలియజేశాడు.

## హరిదత్తవృత్తాంతం

వైఖానససంప్రదాయంలో పుణ్యధర్ముడనే విష్ణుపూజకుడు ఉండేవాడు. అతడు గొప్ప ఆచారాన్ని కలవాడు. భగవానునకు కైంకర్యం చేసేవాడు. భగవదనుగ్రహంవల్ల అతనికి ఒక పుత్రుడు జన్మించాడు. అతని పేరు హరిదత్తుడు. అతనిని పుణ్యధర్ముడు మిక్కిలి ప్రేమించాడు. హరిదత్తుడుకూడా తండ్రి మనస్సు బాధపడని రీతిలో సత్పుత్రుడై వ్యవహరించాడు. పుణ్యధర్ముడు వంశక్రమాగతమైన వైఖానసాగమశాస్త్రాన్ని తన కుమారునకు నేర్పించడం కోసం. అందులో నిష్ణాతుడైన దుర్వాసముని వద్దకు పంపించాడు. సకల శాస్త్రాలను గ్రహించిన హరిదత్తుడు దుర్వాసునకు గురుదక్షిణను ఇవ్వలేదు. అందువల్ల దుర్వాసముని అతనిపట్ల చాలా కోపించాడు. దక్షిణ లేకపోతే చేసిన యాగం కాని, నేర్చిన విద్య కాని పూర్తి కాదు - అని శాస్త్రాలు తెల్పుతున్నాయి. మిక్కిలి కోపాన్ని పొందిన దుర్వాసుడు హరిదత్తుడు రాక్షసుడై కొంతకాలం పరిభ్రమిస్తాడని అతనికి శపించి, ఘటికాచలంలోని నిశాకరముని ఆశ్రమానికి దగ్గరలో సత్పురుషుని దర్శనంవల్ల పుణ్యరూపాన్ని పొంది, విష్ణులోకాన్ని పొందగలడనే శాపవిమోచనాన్ని పలికాడు. రాక్షసుడై తిరిగే హరిదత్తుడు ఏ రూపాన్ని చూస్తాడో ఆ రూపాన్ని పొందుతాడని కూడా దుర్వాసుడన్నాడు. హరిదత్తుడు సింహరూపంలో ఉండే అతడు మృగాన్ని చూచి దీనిపైకి లంఘించాడు. పాపవినాశ తీర్థాన్ని తాగినందువల్ల, సత్పురుషుడైన కౌత్సుని కటాక్షంవల్ల అతని రాక్షసరూపం పోయి దివ్యత్వాన్ని పొంది, విష్ణులోకాన్ని చేరాడు - అని అంటూ నిశాకరముని హరిదత్తుని చరిత్రను తెలిపాడు. సత్పురుషుల కటాక్షం, ప్రేమ, పాపవినాశతీర్థం చాలా గొప్పవి. శుభాలను కల్గిస్తాయి - అని దీనివల్ల తెలుస్తున్నది.

## ఔర్వమునివృత్తాంతం

లంకాద్వీపంలో ఔర్వుడనే ముని ఉండేవాడు. అతని భార్య శ్రుతకీర్తి

పాతివ్రత్యంలో అరుంధతివంటిది. భర్తకు తగిన రీతిలో పరిచర్య చేసేది. గొప్ప వైష్ణవుడైన ఔర్వుడు పుత్రప్రాప్తిని కోరి తీవ్రమైన తపస్సును చేశాడు. అతని తపస్సుకు ఆనందించిన మిగిలిన మునులు అతనికోసం శ్రీమన్నారాయణునిగూర్చి ప్రార్థించారు. శ్రీనివాసుడు వారికి ప్రత్యక్షమై, “జంబూద్వీపంలోని ఘటికాచలంలో ఏకశిలాపర్వతం ఉన్నది. దాని శిఖరంపై గల హేమకోటివిమానంలో నేను వేంచేసి ఉన్నాను” అని పల్కి, ఆ పర్వతానికి పడమటి దిక్కులో శిలాకూటపర్వతంపై అత్రిమహాముని అతని భార్య అనుసూయతో పుత్రసంతతని కోరి తపస్సు చేస్తున్నాడని, అతనివద్దకు పోయి అతని ఆశీస్సును పొందమని ఔర్వమునికి తెలియజేయమని భగవానుడు మునులతో అన్నాడు. మునులు శ్రీమన్నారాయణుని ఆజ్ఞను ఔర్వమునికి తెలిపారు. అతడు లంకనుండి బయలు దేరి ఘటికాచలాన్ని చేరాడు. అత్రిముని ఆశ్రమాన్ని చేరి, అతనినికి నమస్కరించి, భగవదాజ్ఞను ఆ మునికి తెలిపాడు. అత్రిముని ఆజ్ఞానుసారంగా ఔర్వుడు వజ్రతీర్థంలో స్నానమాడి శ్రీనృసింహ స్వామిని ధ్యానించి తపస్సు చేశాడు. ఔర్వమునికి శ్రీనృసింహస్వామి కరుణవల్ల ఒక పుత్రుడు జన్మించాడు. ఔర్వుడు అతనికి ఉగ్రతపస్సు అనే పేరు పెట్టాడు. తరువాత కొంతకాలానికి అత్రిముని, అనసూయాదంపతులకు ఒక కుమార్తె కల్గింది. అత్రిముని దంపతులు ఆమెకు శీలవతి అనే పెట్టి, ఆమెను గారాబంగా పెంచారు. కొంతకాలమైన తరువాత యుక్తవయస్సు వచ్చిన శీలవతిని వారు ఉగ్రతపస్సుకు ఇచ్చి వివాహం చేశారు. ఉగ్రతపస్సు శీలవతిని తీసికొని తామ్రపర్ణీనదీతీరంలో పర్ణశాలను నిర్మించుకొని అక్కడ నివసించాడు. కొంతకాలం తగని ప్రవర్తనతో పాడయిపోయిన అతడు తన భార్య శీలవతి కారణంగా నృసింహస్వామి అనుగ్రహాన్ని పొంది సంస్కరింపబడి సద్గతిని పొందాడు.

## ధర్మవ్రత - కలకంఠవృత్తాంతం

పూర్వం, హనుమత్తీర్థానికి పడమటి దిక్కులోని పర్వతచరియప్రాంతంలో కపిలముని కుమారుడైన కశ్యపుడు తపస్సు చేస్తూ ఉండేవాడు. అతని భార్య ధర్మవ్రత. ఆమె పాతివ్రత్యాన్ని, గొప్ప ఒద్దికను కల్గినది. భర్త మనస్సును గ్రహించి చక్కని సేవను చేసి ఆనందించే సాధుశీల. ఒకనాడు ఆమె కందమూలాలను సంపాదించి తీసికొనిరావడంకోసం అడవికి వెళ్ళింది. ఒక చోట బాగా పండిన వెలగ పండ్లు నేలపై రాలిపడి ఉండగా గమనించింది. సంతోషంతో వాటిని ఏరుకొని తీసికొని బుట్టలో పెట్టుకొని తిరుగు ప్రయాణం ఆరంభించింది. అపుడు ఒక



పులి తటాలున ఆమె మార్గానికి అడ్డు వచ్చి, మానవకంఠంతో తాను చాలా ఆకలి ఉన్నావని, తనకు ఒకపండు ఇవ్వమని వేడింది. పులి మానుషస్వరంతో మాట్లాడడం చూచి ధర్మవ్రత ఆశ్చర్యపడింది. అయినా, తన భర్త ఆకలి తీరిన తరువాత కదా ఇవ్వడానికి సాధ్యమవుతుంది - అని ఆ విషయాన్ని దృఢంగా పల్కింది. పుండరీక తీర్థం తీరంలో అతడు ఆకలితో వేచి ఉన్నాడని, పులి అంతవరకు సహించి ఉంటే, భర్త భుజించిన తరువాత మిగిలిన పండ్లను తానే తీసికొనివచ్చి ఇస్తానని ఆమె పులితో అన్నది. అది విని ఆ పులి తాను ఒక గడియకాలం సేపు వేచి ఉంటానని, అంతలోగా ఆమె రాకపోతే ప్రాణత్యాగం చేస్తానని పల్కి, ఆమెను శీఘ్రంగా తిరిగి రమ్మని పంపింది. పుండరీక తీర్థనామాన్ని విన్న వెంటనే పూర్వజన్మ జ్ఞానాన్ని పొందిన ఆ పులి, ఆ ఉత్తమస్త్రీని చూచి పుండరీకతీర్థం ఉన్న చోటు ఎక్కడో చూపించమని వేడింది. దాని మాటలకు ఆశ్చర్యపడిన ధర్మవ్రత పులివృత్తాంతాన్నిగూర్చి అడిగింది.

సర్మదానదీతీరంలో ధర్మపుత్రుడనే ఒక బ్రాహ్మణుడు తన భార్యతో సంతానంతో నివసించేవాడు. అతడు వేదవిద్వాంసుడు కనుక శిష్యులకు యథా క్రమం వేదాలను నేర్పించేవాడు. ఒకసారి యాగాన్ని చేయడంకోసం మోదుగ ఆకులను సంపాదించడంకోసం వెళ్ళిన ఆ బ్రాహ్మణుడు ఒక చోట మునులు సమూహంగా కూడి ఉండదాన్ని గమనించాడు. వారు వైదికమార్గాన్ని విడచి, వేదాన్ని మఱచి, కేవలం తర్కవాదయుద్ధంలో ఆసక్తులై ఉన్నారు. వారితో వాదించడానికి ఆరంభించిన ధర్మవ్రతుడు వారి వాదయుద్ధంలో చాలా ఆసక్తిని పొందాడు. అతని భార్య ఎంతగానో ధర్మాన్నిగూర్చి పల్కి వద్దని వారించినా, వినకుండా, పంచ మహాయజ్ఞాల వంటి అన్ని వైదికకర్మలను పూర్తిగా విడచిపెట్టాడు. వేదాలను, యాగాలు విడిచి పెట్టిన అతడు ఒకనాడు వ్యాసభగవానుని చూచాడు. తనలో కుతర్కాలను పల్కిన ధర్మపుత్రుని పట్ల వెగటును, కోపాన్ని పొందిన వ్యాసుడు అతనిని పులిగా మాఱమని శపించాడు. అపుడు ధర్మవ్రతునకు తాను చేసిన తప్పు తెలిసింది. వ్యాస భగవానుని పాదాలలో పడి తనను మన్నించమని అతడు వేడాడు.” నీవు పులిరూపంలో నీ భార్యతోపాటు తిరుగుతూ ఘటికాచలాన్ని చేరగలవు. అక్కడ ఒక కొలనులో నీటిని తాగాలని నీవు దిగినపుడు నరసింహస్వామి కరుణవల్ల పులిరూపం పోయి నిజరూపాన్ని పొందగలవు” అని వ్యాసుడు శాపవిమోచనాన్ని పలికాడు. ధర్మవ్రతుడు తన భార్యతో పులిరూపంలో తిరుగుతూ ఘటికాచల ప్రాంతాన్ని చేరాడు. భగవానుని, అతని భక్తులను భావించి,

ఎవరికి హానిచేయకుండా జీవించాడు. దాహం తీరడం కోసం చన్నీటిని తాగాలని ఆ కొలనులోకి దిగిన వారిరువురు, యాదృచ్ఛికంగా ఆ కొలనులో మునిగి పులిరూపాన్ని తీర్చుకుని దివ్యరూపాన్ని పొంది, విష్ణులోకాన్ని చేరారు - అని అంటూ ధర్మపుత్రుని కథను పల్కిన పులి తన వృత్తాంతాన్ని పల్కింది. "తల్లీ! గడచిన జన్మలో రాజపుత్రుడనై ఉన్నాను. గంధర్వనగరంలోని చిత్రరథుడనే గంధర్వ రాజుకు పలువురు పుత్రులుండేవారు. నేను మొదటివాడను. నాపేరు కలకంఠుడు. నాతండ్రి మాకు వీణావాద్యాన్ని నేర్పించమని నారదమునిని వేడారు. నారదుడు మాకు వీణను నేర్పించేటపుడు ఆ ముని సంగీతమహిమను, ఆయనను నేను పరిహసించారు. ఆ ముని నాపై కోపించి, సంగీతాన్ని తెలిసినా, తెలియనివానివలె పరిహసించిన కారణంచేత పులిగా మాఱమని నన్ను శపించాడు. నా తప్పును తెలిసిన నేను మన్నించమని అతనిని ప్రార్థించాను. నారదుడు మనస్సులో జాలిపడి, నాకు శాపవిమోచనంగా - "ఘటికాద్రి ప్రాంతంలోని పులి జంటకు పుత్రుడవై జన్మించి పరిభ్రమించే కాలంలో పుండరీకతీర్థసమీపంలో కశ్యపముని పత్నిని నీవు చూస్తావు. ఆమెను అడ్డగించి వెలగపండ్లను వేడినపుడు పుండరీకతీర్థ మనే మాటను ఆమె పలుకగా, ఆ మాటను విని, పూర్వజన్మ స్మృతిని పొందగలవు. నిజరూపంతో, విమానాన్ని ఎక్కి గంధర్వలోకాన్ని చేరగలవు" అని నారదుడు అన్నాడు - అని పులి తన పూర్వవృత్తాంతాన్ని పల్కి పూర్తి చేయగానే, ఆ పులి తన రూపాన్ని పోగొట్టుకొని గంధర్వరూపాన్ని పొంది, విమానాన్ని ఎక్కి తన లోకానికి చేరింది. పుండరీకతీర్థానికి ఇంతటి మహిమ ఉన్నది. కార్తికమాసంలో వ్రతనియమాలతో దానిలో స్నానం చేసేవారు. జన్మదుఃఖం తీరి మహానందాన్ని పొందగలరు. ఈ భూలోకంలో నివసించిన దినాలలో పూర్ణంగా ఆనందాన్ని అనుభవించగలరు.

## విప్రశేఖరవృత్తాంతం

విప్రశేఖరుడొక బ్రాహ్మణుడు. ఇతడు గొప్ప యోగి. విష్ణుదత్తుని వంశానికి చెందినవాడు. విప్రశేఖరుని వంశంలో పుట్టిన పుంజికస్తుడు మొదలైన కొందఱు బ్రాహ్మణజాతిలో జన్మించినా చాలా కోపస్వభావాన్ని కలవారై, మొఱటుతనాన్ని కల్గి ఉండేవారు. చాలా హీనమైన ప్రవృత్తిని కల్గి అందఱి నిందకు లోనయ్యారు. కులాచారంలో కొంచెం కూడా శ్రద్ధ లేక, హీనకృత్యాలనే చేస్తూ, ఆచార్యులను నిందిస్తూ, బ్రహ్మబంధువులు (బ్రాహ్మణకులానికి విరోధులు) అని నిందింపబడ్డారు. బ్రాహ్మణకులం అంతా వీరిని వెలివేసింది. వీరు మరణించినపుడు, వీరి



శవాలను కాకులు, గద్దలుకూడా ముట్టలేదు. వాటి దుర్గంధాన్ని భరించలేని మునులు వాటిని భస్మం కావాలని శపించారు. పుంజికస్తుని వంశంలో జన్మించిన దేవలుడనేవాడు తన పూర్వులు సద్గతిని పొందాలని, పాపంనుండి విముక్తులు కావాలని ప్రయత్నించాడు. వారు సద్గతిని పొందడంకోసం వింధ్యపర్వతంపై గొప్ప తపస్సు చేశాడు. బ్రహ్మజ్ఞాని, గొప్ప వైష్ణవుడైన ఆ దేవలుడు తన పవిత్రమైన కమండలు తీర్థంతో పుంజికస్తాదుల భస్మాన్ని తడపినా వారు సద్గతిని పొందలేదు. దేవలుని పెద్ద కుమారుడు విప్రశేఖరుడు విలక్షణమైన వ్యక్తిత్వాన్ని కలవాడు, విష్ణుభక్తుడు. అందఱి మంచిని కోరి వర్తించేవాడు. అగస్త్యముని సహోదరుని ఆజ్ఞానుసారంగా అతడు ఘటికాచలానికి పోయి వల్లీసరస్సుతీరంలో ఆశ్రమాన్ని నిర్మించుకొని పితృదేవతలను తరింపజేయాలని తలచి, గొప్ప తపస్సు చేశాడు. భగవద్భాగవత భక్తిని కల అతడు ఘటికాచలంలో మహాప్రదక్షణం, ఆంతరప్రదక్షణం మొదలైనవానిని ఆచరించాడు. ఘటికాచలాన్ని ఎక్కే భక్తుల శ్రమను తీర్చడంకోసం విసన కర్రతో విసరడం మొదలైన సేవలతో వారికి కల్గిన అలసటను తీర్చాడు. కొండను ఎక్కే మెట్లను సరిచేసి, కొండను ఎక్కే భక్తులకు ఆహారాన్ని అందించాడు. సప్తర్షులకు సేవచేసి వారికి ఉపకరించాడు. పర్వతపాదప్రాంతాలలో మొలిచిన మొక్కలు, ముళ్ళు మొదలైనవానిని తొలగించాడు. మంచి దారిని నిర్మించాడు. తన భార్యతో కలసి భాగవతసమారాధన చేసి, తన శక్తికొలది ధనాన్ని, బంగారాన్ని దానం చేసి సేవచేశాడు. సత్పురుషుల ఆశీస్సులను పొందిన అతడు హేమకోటి విమానంలో వేంచేసి ఉండే శ్రీయోగనరసింహస్వామి తన వాక్కులతో స్తుతించాడు. శ్రీనరసింహస్వామి అతని సేవలకు, స్తుతికి సంతోషించి అతని వంశంలోని పూర్వులకు మోక్షాన్ని ఇచ్చాడు.

## గయాక్షేత్రం కంటే గొప్పది ఘటికాచలం

శతధర్ముడనే బ్రాహ్మణుడు విలువిద్యలో సాటిలేనివాడై వెలిగాడు. యవనులు ఉండే చోటికి పోయి వారితో సంబంధాన్ని పెట్టుకొన్నాడు. అతడు, తన భార్య బిడ్డలను పూర్తిగా మఱచి, విలువిద్య మొదలైనవానిలోనే ఆసక్తిని కల్గి ఉండేవాడు. వైదికమార్గాన్ని, వేదాన్ని మఱచి పోయి, పరధర్మాన్ని ఆశ్రయించాడు. మద్య మాంసాలను సేవించాడు. యవనకాంతను వివాహమాడి యథేచ్ఛగా సంచరించాడు. పతితుడైన అతడు మరణించిన తరువాత అతని దుష్కర్మల కారణంగా నరకానికి పోయాడు. అతని భార్య, పుత్రులు అతనినే స్మరిస్తూ, అతడు చేసే

దుశ్చర్యలనుగూర్చి మనోవ్యథను పొందారు. అతని కుమారుడు విష్ణుదత్తుడు పుట్టినప్పటినుండి చాలా మంచివాడు. వేదాలను, శాస్త్రాలను చక్కగా అధ్యయనం చేశాడు, తండ్రి ప్రవర్తనకు చాలా బాధపడ్డాడే తప్ప కోపించలేదు. కన్నతండ్రి దరిద్రు డైనా, పతితుడైనా, అంగవిహీనుడైనా - ఎవరైనా కావచ్చు. తండ్రి అతని తనయునకు గౌరవనీయుడు - అనే శాస్త్రవచనాన్ని బాగా గ్రహించి, దానిని ఆచరించినవాడతడు. పాపిష్ఠివాడైన తన తండ్రి సద్గతిని పొందే దారి ఏది? అని పలు శాస్త్ర గ్రంథాలను పరిశీలించి చూచాడు. పెద్దలను అడిగాడు. తపస్సు చేస్తే మంచి కల్గుతుందని తెలిసి, యాదవగిరిలోని కల్యాణీతీర్థంలో తపస్సు చేశాడు. అయినా, అతని ఆశ ఫలించలేదు. పురుకుత్సుడనే మునిని ఆశ్రయించి, నమస్కరించి, తన తండ్రి నరకకూపంనుండి బయటపడే దారిని తెలుపమని వేడాడు. అతడు తన తండ్రి అస్తికలశాన్ని తీసికొని గయాక్షేత్రానికి పోయి గంగలో అస్తికలను కలిపి, గయాక్షేత్రంలో పితృపిండ ప్రదానాన్ని చేస్తే గదాధరభగవానుడు తృప్తి పొంది, అతని తండ్రి పాపాన్ని తీర్చి మోక్షాన్ని ఇవ్వగలడు - అనే ఉపాయాన్ని పురుకుత్సుడు అతనికి తెలిపాడు. దానిని విని విష్ణుచిత్తుడు తన భార్యతో చాలా దూరంలో ఉండే గయాక్షేత్రానికి బయలుదేరాడు.

అపుడు ఆకాశంనుండి ఒక అశరీరవాణి ఈ విధంగా విన్పించింది. "ఓవిష్ణు చిత్తా! విను. నీతండ్రి సద్గతిని చేరాలని నీవు కోరితే నీవు ఘటికాచలానికి వెళ్ళు. అక్కడ నృసింహతీర్థతీరంలో పితృశ్రాద్ధాన్ని చేస్తే నీ తండ్రికి ఉత్తమ గతి కల్గుతుంది. ఎందుకు? అంటే, "గయాక్షేత్రంకంటే ఘటికాచలం ఎక్కువ మహిమను కల్గినది"- అని భగవానుడే అన్నాడు. ఒకసారి దేవతలు అందఱు కలసి బ్రహ్మనాయకత్వంలో గయ - ఘటికాచలం - అనే రెండు క్షేత్రాలను త్రాసులో పెట్టి దేని మహిమ పెద్దది? అని పరిశీలించినపుడు, ఘటికాచలాన్ని పెట్టిన పళ్ళెం ఎక్కువ బరువు కల్గినదిగా తెలియడంవల్ల నృసింహక్షేత్రమనే ఘటికాచలమే గయకంటే ఎక్కువ గొప్పతనాన్ని కల్గినది - అనే నిర్ణయానికి వచ్చారు. ఘటికాచలంలోని ఏకశిలాపర్వతంలో శ్రీయోగ నరసింహస్వామి వేంచేసి ఉన్నాడు. ఆ స్వామి ఉండే హేమకోటివిమానం చుట్టూ ఉండే యోజనదూరం నరసింహక్షేత్ర మనబడు తున్నది. ఘటికాచలక్షేత్రం ఇహలోక పరలోకాలు రెండిటిలో సుఖసంతోషాలను కల్గిస్తుంది. ఘటికాచలంలో గడియకాలం నివసించినా, ఆవిధంగా నివసించేవాని ఇరవై ఒక్క తరాలు ఉజ్జీవిస్తాయి - అని చెప్పబడింది. నరసింహతీర్థంతీరంలో పితృదేవతలను ఉద్దేశించి శ్రాద్ధం నిర్వహిచడం, గయలో శ్రాద్ధం నిర్వహించినదానికంటే రెండు



రెట్లు ఎక్కువ మంచిని కల్గిస్తుంది. నరసింహుని అంగుష్ఠంనుండి పుట్టిన తీర్థమే నరసింహతీర్థం. అది గంగకంటే ఎక్కువ పవిత్రతను కల్గినది. ఆ తీర్థతీరంలో ఇంగుణమనబడే వృక్షాలు నిండిన చోటు ఉన్నది. నరసింహతీర్థంలో తపస్సు, స్నానం, తర్పణం మొదలైనవానిని చేసేవారికి మోక్షం కల్గడం నిశ్చయం. అందువల్ల దూరంలో ఉండే గయాక్షేత్రానికి వెళ్ళడం మాని, ఘటికాద్రికి త్వరగా వెళ్ళు" అని ఆకాశవాణి పల్కింది.

విష్ణుదత్తుడు ఆకాశవాణిని భగవదాజ్ఞగా భావించి ఘటికాచలక్షేత్రానికి వెళ్ళాడు. నరసింహతీర్థతీరంలో తన తండ్రినిగూర్చి నరసింహస్వామి తృప్తి చెందాలి- అనే నమ్మికతో శ్రాద్ధం, పితృతర్పణం మొదలైనవానిని నిర్వహించాడు. అపుడు అతని ముందు పితృదేవతలు దర్శనమిచ్చి అతనిని ఆశీర్వదించారు. అతడు నరసింహతీర్థంలో శ్రాద్ధాన్ని, తర్పణాన్ని చేయాలని నిశ్చయించుకొన్న క్షణంలోనే అతని తండ్రి నరకంనుండి బయటపడి విష్ణులోకాన్ని చేరినట్లు అతనికి తెలిపారు. విష్ణుదత్తుడు శ్రీనృసింహస్వామి అనుగ్రహంవల్ల చిరకాలం భార్యాబిడ్డలతో సంపదతో సుఖంగా జీవించి, చివరలో మోక్షాన్ని పొందాడు.

## అమృతవల్లీకల్యాణం (లక్ష్మీకల్యాణం)

ఘటికాచలం పధ్నాలుగు శిఖరాలతో అందంగా ఎంతో గంభీరంగా ప్రకాశించే పర్వతం. తూర్పున నాల్గు, దక్షిణంలో ఒకటి, పడమర దిశలో మూడు, ఉత్తరంలో మూడు, ఈశాన్యంలో మూడు - అని ఈ రీతిలో పధ్నాలుగు శిఖరాలున్నాయి. ఘటికాచలంలో ఉత్తర దిక్కులోని పర్వతశిఖరంపై బ్రహ్మ నాల్గు వేదాలను అధ్యయనం చేసి, తపస్సు చేస్తున్నాడు. ఆ తీర్థానికి పశ్చిమపర్వత ప్రాంతంలో ఒక కోనేరు ఉన్నది. దానికి లక్ష్మీతీర్థమని పేరు. క్షీరాబ్ధిలో మందరపర్వతాన్ని కవ్వంగా నిలిపి, వాసుకిని దారంగా చుట్టి, దేవతలు తాము కోల్పోయిన సంపదను పొందాలని ఆ సముద్రాన్ని చిలికినపుడు, మహాలక్ష్మి అవతరించింది. ఆమె పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుని వక్షస్సులో నిత్యవాసాన్ని పొందింది.

ఆమె దేవతలను, అసురులను ఒక వస్తువుగా లెక్కించక పోవడానికి కారణం- "సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణడొక్కడే పురుషుడు, పురుషోత్తముడు. అతడు తప్ప మిగిలిన వారందఱు స్త్రీ ప్రాయులు" అని శాస్త్రాలు పల్కడంవల్ల. లక్ష్మీదేవి మళ్ళీ ఆ రీతిలోనే ఇంకొక అవతారాన్ని ఎత్తి మహావిష్ణువును వివాహమాడాలని తలచింది. తాను అవతరించానికి తగిన చోటు ఘటికాచలమేనని

నిశ్చయించుకొన్నది. అక్కడ ఉండే పెద్ద సరస్సులో వేయిదళాలతో వికసించిన దివ్యమైన తామరపూవులో గొప్ప తేజస్సుతో ఆమె ఆవిర్భవించింది. అపుడు ఆమెను యౌవనాన్ని చూచి దైవకాంతలు, గంధర్వకన్యలు, మునికుమారికలు పొగడి, ఆమెను సేవించారు. రెండు శ్వేతగజాలు తమ తొండాలతో జలకుంభాలను ఎత్తి అభిషేకించి స్తుతించాయి. దేవతలు పూలవాసనను కురిపించారు. మహాలక్ష్మికూడా తన కరుణాకటాక్షాలతో అందఱిని ప్రేమగా, ఆదరంగా చూచింది.

లక్ష్మీదేవివిశ్లేషాన్ని సహించలేని నారాయణుడు ఆమెను వెదకడంకోసం గరుడవాహనుడై ఆకాశమార్గంలో సంచరించసాగాడు. హిమాచలం, ఆర్యావర్తం, వింధ్యపర్వతం, వేంకటాచలంవంటి ప్రాంతాలలో అంతా తన దివ్యనేత్రాలతో కటాక్షిస్తూ అతడు వచ్చేటపుడు వామదేవుడు మొదలైనవారు బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలైన దేవతలు పూలవృష్టిని కురిపించి, స్తుతించే ఘటికాచలాన్ని చూచాడు. దాని నడుమ కుబేరుని ఉద్యానవనంవంటి అందమైన పూలతోట ఒకటి కన్పించింది. అందులో మహాలక్ష్మి ఒక ఊయలలో కూర్చుని ఆనందంగా క్రీడిస్తూ, అక్కడ నాట్యమాడే దేవకాంతలతో దేవతలు, మునులు కీర్తించగా ఆనందించడాన్ని గమనించి సంతోషించాడు. గరుడునిపైనుండి కిందకు దిగి లక్ష్మిదగ్గరకు వచ్చిన భగవానుడు ఆమె ముందుకు వచ్చి నిలచాడు. అతనిని చూచిన లక్ష్మీదేవి సిగ్గుతో తలవంచుకొన్నది. భగవానుడు, చేతిలో తామరతీగను పట్టుకొని ఉండే లక్ష్మీదేవిని ప్రేమగా స్పృశించి ఆమెను తన ఒడిలో కూర్చుండబెట్టుకొన్నాడు. ఆ దివ్యదంపతులు మళ్ళీ కలిసిన సందర్భాన్ని దర్శించిన దేవతలు, మునులు వైదికవిధానంలో వారికి కల్యాణాన్ని నిర్వహించారు. భగవానునకు పూర్వం క్షీరాబ్ధిలో అమృతంతోపాటు లభించిన లక్ష్మీదేవిని మళ్ళీ ఇపుడు అమృతలతతో పాటు స్వామి పొందినందున ఆమెకు అమృతవల్లి - అని, సుధావల్లి - అని పేరును పెట్టారు. శ్రీమన్నారాయణుని కటాక్షం, లక్ష్మీ కటాక్షం ఎవరికి లభిస్తుందో వారు అన్నిసంపదలను పొంది సుఖంగా జీవిస్తారని అనుగ్రహించారు. ఒక శుక్రవారంనాడు లక్ష్మీతీర్థంతీరంలో మహావిష్ణువు లక్ష్మీదేవిని వివాహమాడిన కారణంచేత ఘటికాచలంలో శుక్రవారానికి, లక్ష్మీతీర్థానికి వైలక్షణ్యం, ప్రత్యేకత కల్గింది. దేవేంద్రుడు, కుబేరుడు ఆమెను గొప్పగా స్తుతించి పూజించిన నందున మహాలక్ష్మికటాక్షంతో వారు అంతు లేని సంపదను పొందారు. వసంత కాలంలో భగవానుడు లక్ష్మీదేవిని వివాహమాడినందున శుక్రవారంనాడు లక్ష్మీ



తీర్థంలో స్నానమాడి, సుమంగళీ స్త్రీలను పూజిస్తే, తపస్సు చేస్తే, దానధర్మాలను చేస్తే అష్టైశ్వర్యాలు లభిస్తాయి. విశ్వామిత్రమహర్షి లక్ష్మీ తీర్థంలో స్నానం చేసి, శ్రీనృసింహస్వామిని తలచి, తీవ్రమైన తపస్సు చేసినందున బ్రాహ్మణత్వాన్ని పొందాడు. లక్ష్మీతీర్థతీరంలో పూలు, పళ్ళు, తమలపాకులు, వక్కలు, వస్త్రాలు, బెల్లం, పాలు, పసుపు మొదలైనవానిని దానం చేసినవారు శ్రీలక్ష్మీనరసింహస్వామి కృపకు పాత్రులు కాగలరు.

## శీలవతివృత్తాంతం

శీలవతి అత్రిమహర్షి కుమార్తె. అత్రిమహర్షి ఆశీస్సులను పొంది ఉగ్రతపస్సు ఆమెను వివాహమాడి దక్షిణదిశలో తామ్రపర్ణీ నదీతీరంలో పర్ణశాలను నిర్మించుకొని ఆమెతో కొంతకాలం నివసించాడు. అతడు తగని స్నేహంవల్ల ప్రవర్తనను పాడుచేసికొని దాసీజనం ఆటపాటలలో ఆసక్తుడై, అదే జీవితంగా కాలం గడిపాడు. పలు వ్యాధులకు లోనయ్యాడు. అతని శరీరం అంతా గొప్పవ్యాధి సంక్రమించి వ్యాపించి, పుళ్ళు ఏర్పాడ్డాయి. శరీరంనుండి దుర్గంధం వెలువడింది. మహాపతివ్రత అయిన శీలవతి ఏమాత్రం అతనిని అసహ్యించుకోకుండా అతనికి భక్తితో సపర్యలను చేయసాగింది. భర్త ఎటువంటివాడైనా అతనికి అనుగుణంగా సేవను చేసి మెప్పించడం పతివ్రతాధర్మమని కదా శాస్త్రాలు తెల్పుతున్నాయి. ఉగ్రతపస్సు దుర్మానియై, ఆమెను గర్హించి, దూరం చేసి నిందించాడు. చూచినవారంతా అతనిని నిందించారు. అతనికి మరణం తప్పదు- అనే దశ కల్గింది. శీలవతికి ఏమి చేయాలో తోచనందున చాలా బాధపడింది. అపుడు ఆకాశంనుండి ఒక వార్త వినబడింది. ఉగ్రతపస్సు వ్యాధి తీరి, అతని శరీరానికి ఆరోగ్యం కల్గి చిరకాలం జీవించాలంటే, ఘటికాచలాన్ని చేరి వజ్రతీర్థంలో స్నానం చేసి నృసింహస్వామిని ఆరాధించమని ఆకాశవాణి ఆమెకు తెల్పింది.

పుట్టుగుడ్డివానికి చూపు వస్తే ఆనందించినట్లుగా ఆ మాటను విని శీలవతి చాలా ఆనందించింది. చాలా అసహ్యకరమైన శరీరంతో ఉండే తన భర్తను భుజాలపై మోస్తూ మెల్లగా నడచి ఉత్తరదిశగా ప్రయాణం చేసింది. పలు దినాల ప్రయాణం తరువాత ఇక నడవలేక పోయింది. భర్త మూర్ఛను పొందిన స్థితిలో ఉండడాన్ని గమనించి ఆమె చాలా భయపడింది. దైవవాణి అసత్యం కాగలదా! అనే చింత ఆమెకు కల్గింది. మఱునాడు ఉదయం కావడానికి ముందే ఘటికాచలాన్ని చేరాలనే తన ప్రయత్నం. వ్యర్థమవుతుందేమోనని భీతిల్లింది.

క్రమంగా సూర్యుడు అస్తమించడం ఆరంభించాడు. రాత్రి చీకట్లు అంతటా కమ్ముకోవడం ఆరంభమైనది. సూర్యుడు అస్తమిస్తే తాను చేయగల్గినది ఇక ఏదీ లేదని భయపడి, పగటికాలంలోనే ఘటికాద్రిని చేరాలని తలచింది, శీలవతి. అగ్నిదేవుని పూజించి రాత్రిసమయం కాకుండా నిలచి పోవాలని ఆజ్ఞాపించింది. అపుడు అంతటా వ్యాపించే చీకట్లు తొలగిపోయాయి. ఆకాశంలో సూర్యుడు తన వేడిమిని కోల్పోకుండా గొప్ప కాంతితో మళ్ళీ ప్రకాశించడం ఆరంభించాడు. మునులకు, ఇతరులకు ఆ కాలానికి తగిన కర్తవ్యాలను చేయడం సాధ్యం కాకుండా పోయింది. సాయం సమయంలో సూర్యుని బాధించే మందేహులనే అసురవర్గం బలాన్ని పొంది, సూర్యుని బాధించడం ఆరంభించింది. ఉదయం, సాయంకాలం సూర్యుని బాధించే మందేహుల బలాన్ని లేకుండా చేయడంకోసం మునులు రెండు సంధ్యా కాలాలలోను అర్ఘ్యప్రదానాన్ని చేస్తారు. దానిని వారు చేయలేకపోయి నందున మందేహుల బలం వృద్ధి అయినది. దేవతలు దీనిని చూచి భయపడి, శీలవతి తల్లి అనసూయ వద్దకు వచ్చి నమస్కరించి, ధర్మం చెడకుండా ఉండేటట్లు, అధర్మం నశించేటట్లు చేసి, రక్షించమని అర్థించారు. ఆమె దేవతల ప్రార్థనకు అంగీకరించి, శీలవతి దగ్గరకు వేగంగా వచ్చి ఆమెకు పలు రీతులలో ఊరట కలిగే మాటలను పల్కి, రాత్రిసమయం రావడానికి అనుమతించమని ఆమెను కోరింది. శీలవతి ఆజ్ఞవల్ల లోకం అంతా బాధపడుతున్నదని తెల్పి, అందఱి క్షేమాన్ని గమనించి తన పట్టును విడువమన్నది. తల్లి మాటలను కాదనలేని శీలవతి రాత్రి సమయం కావడానికి సమ్మతించగా కాలచక్రం యథాపూర్వంగా ప్రవర్తించింది. మునులు తమ తమ కర్తవ్యాలను నిర్వహించారు. తమ కోరికను మన్నించిన శీలవతిని దేవతలు ఆమెను భర్తతో కలసి వజ్రతీర్థంలో స్నానమాడి అభీష్టాన్ని పొందమన్నారు. అత్రిదంపతులకు త్రిమూర్తులు తాము సంతానంగా ఉద్భవిస్తామని కూడా వరమిచ్చారు. శీలవతి, ఉగ్రతపస్సు వజ్రతీర్థంలో స్నానమాడి శ్రీనృసింహ స్వామిని సేవించారు. ఆ స్వామి అనుగ్రహంతో ఉగ్రతపస్సు వ్యాధి తీరింది. వజ్రంవంటి బలమైన శరీరాన్ని అతడు పొందాడు. భగవదనుగ్రహంతో సుఖసంపదలను పొంది చిరకాలం సుఖంగా జీవించారు. త్రిమూర్తులు అత్రి దంపతులకు వరమిచ్చిన క్రమంలో, బిడ్డలుగా జన్మించారు. విష్ణుభగవానుని అంశతో దత్తాత్రేయుడు, బ్రహ్మ అంశతో చంద్రుడు, శివుని అంశతో దుర్వాసుడు జన్మించారు. పుత్రసంతాన లాభాన్ని కోరేవారు, అంగవైకల్యాన్ని పోగొట్టు కొనదలచినవారు, వ్యాధి బాధలను తీర్చుకొనదలచినవారు - అందఱు అత్రిమహర్షి



ఆశ్రమసమీపంలో ఉండే వజ్రతీర్థాన్ని సేవిస్తారు. శీలవతి తన భర్తను అందులో స్నానం చేయించినంతనే అతని వ్యాధి తీరి, బలిష్ఠమైన, బంగారువలె మెరిసే వంటి శ్రేష్ఠమైన శరీరాన్ని పొంది, తన భార్యతో చిరకాలం జీవించాడు. ఈ విధంగా వజ్రతీర్థంలో భార్యతో పాటు స్నానం చేసి, ఘటికాద్రి నరసింహుని సేవిస్తే శరీరదార్ఢ్యం, సంతానప్రాప్తి కల్గుతాయి.

ఘటికాచలక్షేత్రమహిమ, భగవత్కృప మొదలైనవానిని ఈవిధంగా తెలిపిన వశిష్ఠుడు, తరువాత అక్కడ ఆ క్షేత్రంలోని తీర్థాల మహిమను కూడా ఇంద్రద్యుమ్ను నకు తెలిపాడు. ఏకశిలాపర్వత సమీపంలో బ్రహ్మతీర్థం ఉన్నది. ఆ ప్రాంతంలో శింశుపావృక్షంమూలలో నృసింహస్వామి కరుణను పొందిన భైరవముని పుణ్యతీర్థాలను రక్షిస్తున్నాడు. అతని రక్షణ కారణంగా దెయ్యాలు, పిశాచాలు మొదలైనవి అక్కడకు రావు.

## బ్రహ్మతీర్థమహిమ

స్వారోచిషమన్వంతర కాలంలో ఒకానొక సమయంలో ఇంద్రుడు వేదాలను చూచి, “మీరు ఎవరిని పరతత్త్వమని నిర్ణయిస్తున్నారు!” అని ప్రశ్నించాడు. వేదాలపుడు చతుర్ముఖ బ్రహ్మయే పరతత్త్వమని, అతనినే తాము స్తుతిస్తున్నామని అన్నాయి. బ్రహ్మసైతం నమస్కరించి స్తుతించే మహిమ కలవాడు, నారాయణునకు కూడా ప్రియమైనవాడు, దేవతలు, మునులు స్తుతించే కీర్తిని కలవాడైన శివుడే పరతత్త్వమని, బ్రహ్మను పరతత్త్వంగా వేదాలు పల్కడం తగదని అంటూ ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని వేదాలపై ప్రయోగించాడు. వజ్రాయుధానికి భయపడిన వేదాలు బ్రహ్మను ఆశ్రయించాయి. బ్రహ్మ తన హుంకారంతో వజ్రాయుధాన్ని నిలువరించి, తన కమండలంలోని తీర్థం జల్లి, ఆ ఆయుధాన్ని ఇంద్రుని పైకి పంపాడు. తాను ప్రయోగించిన వజ్రం మిక్కిలి బలంతో తనపైకి రావడాన్ని చూచిన ఇంద్రుడు శూలపాణి అయిన శివుని చేరి జరిగిన సంగతిని అతనికి తెలిపి, అతనిని శరణు వేడాడు. ఈశ్వరుడు కోపంతో చూడగా వజ్రాయుధం తన శక్తిని కోల్పోయి కింద పడింది. భక్తులపట్ల ప్రేమను కల పశుపతి బ్రహ్మ చేసిన పనిని గమనించి, కోపంతో “బ్రహ్మ తలబిరుసుతో చేయరాని పనిని చేశాడు” అని అతని గర్వం అణచేటట్లు అతని అయిదు తలలలో ఒక తలను తన త్రిశూలంతో గిల్లివేశాడు. అప్పటినుండి బ్రహ్మ చతుర్ముఖుడయ్యాడు. చతుర్ముఖ బ్రహ్మ పంచముఖుడైన శివుని స్తుతించి, వేదాలు తనను స్తుతించగా తన లోకాన్ని చేరాడు. అయినా,

అంగవైకల్యాన్ని పొందిన దోషాన్ని తీర్చుకోవాలని తలచి బ్రహ్మ ఘటికాచలాన్ని చేరి, ఒక తీర్థం తీరంలో నివసించి, నృసింహునిగూర్చి గొప్ప తపస్సు చేశాడు. యజ్ఞయాగాదులను చేసి తన కొఱత తీరేటట్లు అనుగ్రహించమని ఘటికాద్రీశుని వేడాడు. ఆ స్వామి కృపవల్ల అతని దోషం తీరింది. అతడు ప్రతిదినం స్నానమాడి, యజ్ఞాలను, తపస్సును చేసి శ్రీయోగనృసింహుని సేవించిన మహిమను కల్గిన కారణంవల్ల ఆ తీర్థానికి బ్రహ్మతీర్థమనే పేరు కల్గింది.

గురువారంనాడు బ్రహ్మతీర్థంలో స్నానం చేసి, నరసింహస్వామిని కొలిస్తే అభీష్టసిద్ధి కల్గుతుంది. పవిత్రమైన మనస్సుతో స్నానం చేసి, నమ్మికతో అక్కడ పితృతర్పణం, దానం, తపస్సు మొదలైనవానిని ఆచరిస్తే అతని సంతానపరంపర అవిచ్ఛిన్నంగా కొనసాగుతుంది. ఆ తీర్థంతీరంలో వృక్షాలను నాటి పెంచితే, ఇహలోక పరలోక సౌఖ్యాలు కల్గుతాయి. మాఘమాసంలో సూర్యోదయసమయాన బ్రహ్మ తీర్థంలో స్నానం చేసి ఘటికాద్రీశుని ధ్యానిస్తే, అన్ని పాపాలు పోయి, శుభం కల్గుతుంది.

## భైరవ-హలావర్తతీర్థాల మహిమ

బ్రహ్మతీర్థం సమీపంలో భైరవతీర్థం ఉన్నది. అందులో సోమవారం నియమంతో స్నానమాడితే భూతప్రేతపిశాచాల బెడద తీరుతుంది. అందులో స్నానం చేసే పుణ్యాత్ములను చూచి అవి భయపడి దూరంగా పోతాయి.

భైరవుడు తపస్సు చేసే పర్వతం ఒకానొక సమయంలో హిమవత్పర్వతంతో పోటీ పడి ఆకాశంలో ఉన్నతంగా ఎదగడం ఆరంభించింది. అందువల్ల మేరుపర్వతం చుట్టూ పరిభ్రమించే సూర్యచంద్రుల గమనానికి అడ్డు కల్గింది. భైరవమునికి భయపడిన ఇంద్రుడు బలరామునివద్దకు పోయి భైరవపర్వతం ఉన్నతంగా పెరిగే వృత్తాంతాన్ని తెల్పి, దాని వృద్ధిని అడ్డుకొని, సూర్యచంద్రులు గమనానికి సహాయపడమని అర్థించాడు. బలరాముడు తన నాగలితో ఆ పర్వతశిఖరాన్ని కిందకు లాగి భైరవపర్వత వృద్ధిని అడ్డగించాడు. బలరాముడు హలాయుధంతో ఆ పర్వత శిఖరాన్ని లాగిన చోటునుండి జలం స్రవించింది. దానికి దేవతలు హలావర్త తీర్థమనే పేరును పెట్టారు. హలావర్తతీర్థంలో స్నానం చేస్తే అంతు లేని శుభాలు కల్గుతాయి. చంద్రుడు గురుపత్నితో సంగమించినందుల్ల అతనికి కల్గిన దోషాన్ని, అతడు హలావర్తతీర్థంలో స్నానమాడి, వ్రతం అనుష్ఠించి



పోగొట్టుకొన్నాడు. ఇంద్రుడు అహల్యాసంగమదోషాన్ని ఇందులో స్నానం చేయడం ద్వారా తీర్చుకొన్నాడు.

## గౌతమతీర్థం

భైరవముని ఆశ్రమానికి సమీపంలోనే గౌతమముని తపస్సు చేశాడు. ఇంద్రుడు తన శత్రువైన త్వాష్ట్రుని వధించిన పాపాన్ని గౌతమతీర్థంలో స్నానం చేసి నశింపజేసికొన్నాడు. శ్రీనృసింహస్వామియొక్క విశ్వరూపాన్ని దర్శించ గోరి, మునుల ఆజ్ఞానుసారం అందులో స్నానం చేశాడు. కోటిసూర్యుల ప్రకాశంతో తేజోరూపుడై దర్శనమిచ్చిన శ్రీనరసింహుని దర్శించి స్తుతించి, తన దోషాలను క్షమించమని ఇంద్రుడు వేడాడు. వైశాఖమాసం శనివారంలోను, పౌర్ణమినాడు గౌతమీతీర్థంలో స్నానమాడి భగవానుని సేవించేవారు గొప్ప మంచిని పొందుతారు.

## అగస్త్యతీర్థం

వామదేవుడు అమృతాన్ని పొందగోరి అగస్త్యముని తపస్సు చేసే ఘటికా చలానికి వెళ్ళాడు. అగస్త్యుడు గిరిగైరికమనే చోట ఆశ్రమాన్ని నిర్మించుకొని తపస్సు చేశాడు. అతడు స్నానపానాదులకోసం నిర్మించుకొన్న తీర్థమే అగస్త్యతీర్థం. పూర్వ కాలంలో మహాలక్ష్మి వేగవతిగా జన్మించి ఘటికాచలంలో తపస్సు చేసింది. శబరి అనేవాడు ఆమె గొప్పతనాన్ని గ్రహించి కందమూలాలను, ఫలాలను ఆమెకు ఇచ్చి సేవచేశాడు. రావణుడు ఆకాశమార్గంలో వెళ్ళేటప్పుడు వేగవతిని చూచాడు. అతడు ఆమె ప్రభావాన్ని తెలియలేక ఆమెపట్ల మోహించి ఆమెను బలాత్కారం చేయబోయాడు. శబరి ఎంతగా నిరోధించినా రావణుడు వినలేదు. వేగవతి కోపించి త్రేతాయుగంలో తాను జన్మించి అతనిని నశింపజేస్తానని శాపమిచ్చి సింధువార వృక్షం మూలప్రదేశంలో అంతర్ధానమైనది. రావణుడు అవమానపడి వెనుదిరిగి పోయాడు. అగస్త్యతీర్థంలో మంగళవారంనాడు స్నానమాడి శ్రీఘటికాద్రీశుని సేవిస్తే పరద్రవ్యాలను అపహరించినందువల్ల కలిగిన పాపం తీరుతుంది.

వరాహతీర్థం : హలావర్తతీర్థానికి ఉత్తరదిశగా పెద్ద అరణ్యం ఒకటి ఉండేది. జాంబవంతుని కుమార్తె జాంబవతికి ఒక వరాహం తన కోరపంటితోను, కాళ్ళగోళ్ళ తోను ఒక తీగదుంపను భూమినుండి తవ్వి ఇచ్చినపుడు అక్కడ పెల్లుబికిన తీర్థమే వరాహతీర్థం. దానికే వల్లీతీర్థం, శిలాపుష్కరిణీతీర్థం అనే పేర్లు కూడా

ఉన్నాయి. ఉదయం, సాయంకాలం అందులో స్నానమాడితే భగవదనుగ్రహం కల్గుతుంది. విషువు అనబడే చైత్రం, ఆశ్వయుజ మాసాలలోను, ఆషాఢం, పుష్యమాసాలు అనే ఆయనకాలాలలోను, సూర్యచంద్రగ్రహణసమయాలలోను శిలాపుష్కరిణిలో స్నానమాడి, తీర్థతీరంలో పితృతర్పణం, దానం మొదలైనవానిని చేస్తే, అంతు లేని శుభాలు సమకూరుతాయి. ఈ జన్మలోనే చాలా కాలం సంతోషంతో జీవించి మఱుజన్మలో మోక్షానందాన్ని పొందగలడు.

హనుమత్తీర్థం : ఘటికాచలంలోని తూర్పుపర్వత శిఖరంలో ఆంజనేయ స్వామి శ్రీనృసింహస్వామిని ఉద్దేశించి తపస్సు చేశాడు. అతని పేరుతో ఆ పర్వతంలో ఏర్పడిన తీర్థం హనుమత్తీర్థం. బంగారు రంగులోని తామరలు నిండిన హనుమత్తీర్థం తీరంలో వృక్షాలుకూడా బంగారు రంగులో కన్పిస్తాయి. ఆ తీర్థస్పర్శతో పశు పక్ష్యాదులుసైతం స్వర్ణవర్ణాన్ని పొందుతాయి. ఆంజనేయస్వామి తన శక్తితో తీసికొని వచ్చి, దాని తీరంలో నాటిన నేరేడుచెట్టు పండ్లతో నిండి ఉంటాయి. శైవ- వైష్ణవభేదం లేకుండా అందఱు అందులో స్నానం చేసి, హనుమానుని కొలిచి ప్రదక్షిణం చేసి తమ అభీష్టాలను అన్నిటిని తీర్చుకొంటారు. సూర్యుడు ఆంజనేయుని అనుగ్రహించిన ఆదివారంనాడు హనుమత్తీర్థంలో స్నానమాడితే తలచిన కార్యం తలచినట్లు సమకూరి ఆనందం కల్గుతుంది. రావణుని వధించిన తరువాత శ్రీరాముడు సీతతో కలిసి పుష్పకవిమానంలో ఎక్కి ఆయోధ్యకు తిరిగి వచ్చే దారిలో ఆంజనేయుని ప్రార్థనను మన్నించి హనుమత్తీర్థంలో కొంచెం సేపు నిలచాడు. సీతతో ఆ తీర్థంలో స్నానమాడి ఆనందించిన తరువాత అయోధ్యకు తిరిగి వెళ్ళాడు. శ్రీరాముడు స్నానమాడి ఆనందించినందువల్ల, హనుమానునకు ప్రియమైనది కనుక ఈ హనుమత్తీర్థం గొప్ప పేరును పొందింది. నియమంతో అందులో స్నానమాడి, గిరిప్రదక్షిణం చేసి పరమాత్మను స్తుతించేవారికి అంతు లేని సంపదలు కల్గుతాయి. శ్రీయోగనరసింహస్వామి కృపకూడా లభిస్తుంది.

పాండవతీర్థం : హనుమత్తీర్థానికి ఉత్తరదిశలోని పర్వత శిఖరంలో పాండవులు వనవాస సమయంలో నివసించి, తపస్సు చేశారు. అర్జునుడు గొప్ప తపస్సు చేసి శివునివల్ల పాశుపతాస్త్రాన్ని పొందాడు. వారు, శ్రీకృష్ణుని రథసారథిగా చేసికొని కౌరవులను భారతసంగ్రామంలో జయించడంకూడా ఘటికాద్రినరసింహుని కృపవల్లనే జరిగింది. వరాహతీర్థంలో స్నానమాడిన తరువాత పాండవతీర్థంలో



స్నానం చేసి తపస్సు, దానం మొదలైనవానిని చేస్తే వేయి గోవులను దానం చేసిన పుణ్యం కల్గుతుంది. ఘటికాచలంలోని హేమకోటివిమానంలో ప్రకాశించే యోగనరసింహ స్వామిని సాక్షాత్తు దర్శించి నమస్కరించాలి.

హేమకోటివిమానం కింద అద్భుతంగా ప్రకాశించే యోగనరసింహస్వామిని దుర్వాసమహాముని మిక్కిలి భక్తితో స్తుతించాడు. నృసింహస్వామి వాత్సల్యంతో అతనికి తులసీమాలను ఇచ్చాడు. దుర్వాసమహాముని నరసింహస్వామి ప్రసాదమైన తులసీమాలను తలపై, భుజాలపై, కంఠంలో పలుమార్లు అలంకరించుకొని, భగవానుని నిర్హేతుకమైన అనుగ్రహానికి విస్మయం చెంది, ఆ స్వామిని భక్తితో పాడి ఆడి స్తుతించాడు. దుర్వాసముని చేష్టలను చూసిన అక్కడ ఉండే బుధుడు వినయం లేకుండా పరిహసించాడు. బుధుడు అత్రిగోత్రంలో పుట్టినవాడు. పాండవులకు ముత్తాత వరుసలోనివాడు. శ్రీనృసింహ స్వామి సన్నిధిలో వినయ విధేయతలు లేకుండా, పరమభాగవతుడైన దుర్వాసముని చేసిన స్తుతిని చూచి భయం లేకుండా గేలి చేసిన బుధునిపై ఆముని కోపించాడు". దివ్యత్వాన్ని కోల్పోయి భూమిపై పుట్టాలని బుధుని శపించాడు. బుధుడు తన అపరాధానికి విచారించి, దుర్వాసమునిని శరణు వేడి, తనను మన్నించి శాపవిమోచనాన్ని తెలుపమని ప్రార్థించాడు. "నరసింహస్వామి నిర్మాల్యం మొదలైన ప్రసాదాలు ఆ స్వామి కృపవల్ల మాత్రమే లభిస్తాయి. అటువంటి ప్రసాదాలను పొందినవారిని గేలిచేయ కూడదు. భగవత్ప్రసాదాన్ని, భాగవతులను అవమానించే వారు దండనార్హులు. అందువల్ల పన్నెండు ఏండ్లు ఘటికాచలంలో నివసించి, నరసింహస్వామికి సేవచేసి, అతని అనుగ్రహంతో మళ్ళీ దేవలోకాన్ని చేరగలవు"- అని ముని కరుణతో శాపవిమోచనాన్ని తెలిపాడు. బుధుడు పాండవతీర్థ తీరంలో పన్నెండు ఏండ్లు కఠినతపస్సును చేశాడు. శ్రీనరసింహుని కృపతో శాపం పోగొట్టుకొని దేవలోకాన్ని చేశాడు. బుధవారంనాడు పాండవతీర్థంలో స్నానమాడితే గొప్ప ఫలాన్ని పొందవచ్చు. పాండవతీర్థతీరంలో దానం, ధర్మం, తపస్సు చేసేవారు సాధు (మంచి) వచనాలనే పలకాలి. త్రికరణాలతో వినయంగా, ఋజువుగా నడచుకోవాలి.

ఈ రీతిలో ఘటికాచలక్షేత్రవైభవాన్ని వశిష్ఠుడు పలుకగానే నృసింహుని సేవించి మోక్షాన్ని చేరాలనే తొందర ఇంద్రద్యుమ్నునకు మఱింత కల్గింది. వశిష్ఠుడు అతని త్వరను గమనించి మోక్షానందాన్ని శీఘ్రంగా కల్గించగల నరసింహ

కవచమంత్రాన్ని అతనికి ఉపదేశించాడు. శిలాపుష్కరిణిలో మూడు మార్లు ఆచమనం చేసి నియమంతో శ్రీనరసింహస్వామి మంత్రాన్ని ఇంద్రద్యుమ్నుడు జపించాడు. తరువాత వశిష్ఠుడు వెంట రాగా తన భార్యతో కలిసి ఘటికాచలాన్ని ఎక్కడం ఆరంభించాడు. దారిలో ఒక తీర్థాన్ని చూచిన అతడు దానినిగూర్చి తెలుప వలసినదిగా వశిష్ఠుని అడిగాడు. "వామదేవుడు మొదలైన మహాత్ములకు గడియ కాలంలోనే మోక్షాన్ని ఇచ్చిన నరసింహస్వామి తన అనుగ్రహంతో ఆవిర్భవింప జేసిన నరసింహతీర్థం అది. బ్రహ్మ తలను గిల్లి పారవేసినందున శివునకు బ్రహ్మ హత్యాదోషం చుట్టుకొన్నది. పార్వతి ఆ దోషం పోవడంకోసం ఒక దారిని శివునకు తెల్పింది. దానిని విన్న శివుడు తన పత్నితో పాటు ప్రమథగణాలు వెంట రాగా ఘటికాచలానికి వచ్చి నరసింహ తీర్థంలో తనభార్యతో కలసి స్నానమాడి, నరసింహుని కృపను అర్థించాడు. లోకనాథుడైన నరసింహమూర్తి అనుగ్రహంతో తన పాపాన్ని తీర్చుకొన్న భూతనాథుడు కైలాసనాథుడయ్యాడు. నరసింహతీర్థ స్నానం, మోక్షాన్ని ఇవ్వగల్గినది" అని అంటూ వశిష్ఠుడు ఇంద్రద్యుమ్నునకు ఆ తీర్థాన్ని గూర్చి తెలిపాడు. వశిష్ఠుని అనుమతితో ఇంద్రద్యుమ్నుడు భార్యా సహితుడై నరసింహతీర్థంలో స్నానమాడి భగవానిని మోక్షాన్ని అనుగ్రహించమని వేడాడు.

తరువాత ఇంద్రద్యుమ్నుడు కొండను ఎక్కేటపుడు ఆ కొండ శిఖరంలో మెఱపు తీగవలె మెఱిసే ఒక తీగను చూచి విస్మయపడ్డాడు. హేమకోటి విమానమనే తామరపూవుకు కాడవలె మనస్సుకు ఆకర్షణీయంగా వెలిగే ఆ తీగను గూర్చి వశిష్ఠుడు పల్కుతూ - "పూర్వం మానససరస్సులో నివసించే ఒక హంస తామర దుంపను తీగతో పాటు ఆకాశమార్గంలో తీసికొని వెడుతూ ఘటికాచల శిఖరంపై ఎగిరే సమయంలో ఆ తీగ ఆ హంసనోటినుండి జారి, ఘటికాద్రి శిఖరంపై పడింది. ఆ హంస ఆ తీగను బ్రహ్మకు ఇవ్వడంకోసం తీసికొని వెడుతూ ఉండగా ఈ సంఘటన జరిగింది. స్వర్ణమయమైన పర్వతశిఖరంలో అందంగా నాటుకొన్న ఆ తీగను తిరిగి తీసికొనిపోవడానికి సాధ్యం కాక హంస నృసింహస్వామిని ప్రార్థించింది. అపుడు నృసింహస్వామి, "ఆ తామరతీగను తిరిగి తీసికొనిపోయే ప్రయత్నాన్ని చేయవద్దు. నేను హిరణ్యకశిపుని వధించేటపుడు ఆ అసురుని పేగుల మాల నా వక్షఃస్థలంలో అందంగా ప్రకాశించినట్లుగా, తామరతీగ పూవుతో పాటు ఈ లత ఘటికాద్రి శిఖరాన్ని అలంకరిస్తున్నది. దీనిని చూచి నాకు చాలా ఆనందం కల్గింది. ఇక బ్రహ్మవాహనాలలో నీవు పూజ్యుడవు కాగలవు" అని పల్కి ఆ హంసను



అనుగ్ర హించాడు. ఘటికాద్రి కొండచరియలలో నాటుకొన్న ఆ తామర తీగను దర్శించిన వాని వంశం ప్రకాశిస్తుంది. అతడు పూర్ణమైన ఆయుస్సును పొందగలడు. పాపం తీరినవాడు కాగలడు. నృసింహస్వామి పూర్ణకృపకు పాత్రుడు కాగలడు" - అని వశిష్ఠుడు పలికాడు. వశిష్ఠుని ఆజ్ఞానుసారం ఇంద్రద్యుమ్నుడు హంసతీర్థంలో స్నానమాడి హంసబలిని సమర్పించి పవిత్రుడయ్యాడు అంతేకాక, కొండను ఎక్కటపుడు దక్షిణదిక్కులో వెలిగే హేమకోటివిమానాన్ని చూచాడు. దానికి ఎదురుగా గంభీరంగా వెలిగే శిఖరాన్ని చూచి ఆశ్చర్యపడ్డాడు.

ఆ శిఖరంలోనే ప్రహ్లాదుడు తపస్సు చేసి, మోక్షాన్ని పొందాడు. హిరణ్యకశిపుడు తన కుమారుడు ప్రహ్లాదుడు తన మాటను వినకుండా భగవానుని కీర్తించడం గమనించి చాలా కోపాన్ని పొందాడు. అతనిని రాతికి కట్టి సముద్రంలో పడవేయమని తన సేవకులను ఆజ్ఞాపించాడు. వారు ఆవిధంగానే చేశారు. ప్రహ్లాదుడు తనకు సహాయం శ్రీమన్నారాయణుడే - అని నిశ్చయించుకొని, ఆ స్వామినే మనస్సులో చింతిస్తూ ఉన్నాడు. శ్రీనరసింహస్వామినామం అతనిని సముద్రంనుండి దరికి చేర్చింది.

ప్రహ్లాదుడు నృసింహస్వామినిగూర్చి తపస్సు చేసిన గొప్ప శిఖరానికి దక్షిణ దిక్కులో శంఖతీర్థం, పడమటి దిక్కులో చక్రతీర్థం ఉన్నాయి. ఘటికాచలానికి రెండు కన్నుల వలె వెలిగే ఆ తీర్థాలలో అభీష్టసిద్ధిని కోరేవారు స్నానం చేయాలి. సూర్యచంద్రులు, కుబేరుడు, శివుడు, బ్రహ్మ వీటిలో స్నానమాడి అభీష్టాలను పొందారు. కుబేరుడు ఐశ్వర్యాలకు అధిపతిగా కావాలని కోరాడు. శంఖతీర్థంయొక్క మహిమను, ఘటికాచలక్షేత్రమహిమను నారదుడు చెప్పగా విన్నాడు. విశ్రవసువు కుమారుడైన కుబేరుడు లక్ష్మీదేవి అనుగ్రహాన్ని కోరి, భగవానుని అనుగ్రహాన్ని వేడి, ఘటికాచలంలో తపస్సు చేశాడు. భగవద్భక్తులకు సేవచేశాడు. లక్ష్మీదేవిని గూర్చి శ్రీసూక్తపారాయణాన్ని నిరంతరం చేశాడు. శ్రీమహాలక్ష్మి అమృతలతను చేతిలో ధరించి అతని ముందు ప్రత్యక్షమై, అతనికి ధనాధిపతిత్వాన్ని, దాతృత్వాన్ని ఇచ్చింది. అమృతలతను చేతిలో ధరించి ప్రసన్నురాలైనందున మహాలక్ష్మిని దేవతలు, మునులు "అమృతవల్లి" అని పొగడి స్తుతించారు. మహాలక్ష్మి ఘటికాచలంలో "అమృతవల్లి, అమృతఫలవల్లి" - అనే నామాలతో కీర్తింపబడు తున్నది.

హేమకోటివిమానం సింహాలతో మోయబడుతున్నది. ఓంకారరూపంలో

ఉన్నది. దేవతలచే, మునులచే స్తుతింపబడుతున్నది. ఆకాశాన్ని తాకే రీతిలోని ఔన్నత్యాన్ని కల్గినదై, జ్యోతిర్మయమై, భూతాలు, ప్రేతాలు, పిశాచాలు, బ్రహ్మ రాక్షసులు - అనే పాపులకు దరిచేరడానికి, భావించడానికికూడా వీలు కాని మహిమను కల్గినదై, ఎనిమిది దిక్కులను కావలి కాచే దిక్పాలకులచే, శివుడు, బ్రహ్మ అనే వారిచే ఎల్లప్పుడు కీర్తింప బడేదై, వైఖానసమునులచే ఆరాధింపబడేదై శ్రీనృసింహమూర్తి అనే మణి భద్రపరచబడిన పేటిక (పెట్టె)యై, భూలోకవాసులచే పరమపదవాసులచే సేవింపబడే గొప్పతనాన్ని కల్గినదై వెల్గుతున్నది.

ప్రబలపాపరాశిని నిర్మూలించే ఘటికాద్రినాథుడు అయిన నృసింహుని ఇంద్రద్యుమ్నుడు తన భార్యతో కలిసి నమస్కరించాడు. ఆనంద బాష్పాలను విడిచాడు.

శ్రీయోగనరసింహమూర్తి వశిష్ఠుని చూచి "ఇంద్రద్యుమ్నుడు పుట్టిననాటి నుండి ఈనాటివరకు విష్ణుభక్తుడై వెలిగాడు. లోకం స్తుతించే పుణ్యాత్ముడితడు. ఇంద్రియాలను, శత్రువులను వశం చేసికొన్నవాడు, నా భక్తుల విషయంలో భక్తిని కలవాడు. అగస్త్యుడు మొదలైన మునులపట్ల ఉత్తమ భక్తిశ్రద్ధలను కలవాడు. భగవద్భక్తిని లోకంలో ప్రచారం చేసిన కీర్తిమంతుడు. అతడు కోరినట్లుగానే మోక్షాన్ని పొందగలడు" అని అన్నాడు. నృసింహమూర్తి ఇంద్రద్యుమ్నుని అనుగ్రహించి నందులకు ఆ స్వామిని వశిష్ఠుడు కీర్తించాడు. శ్రీనృసింహుడు స్వయంగా తన నోటితో "ఇంద్రద్యుమ్నుని అనుగ్రహించాను" అని అనగానే, వశిష్ఠాది మునులు చూస్తూ ఉండగానే, ఇంద్రద్యుమ్నుడు తన భార్యతో పాటు తేజోరూపాన్ని పొంది, విష్ణులోకాన్ని చేరాడు. ఇంద్రద్యుమ్నుడు బ్రహ్మర్షిత్వాన్ని, విష్ణుసాలోక్యాన్ని పొంది, నిత్యం శ్రీమన్నారాయణుని ఆరాధిస్తూ ఆనందిస్తున్నాడు.

ఈ విధంగా ఘటికాచలమహిమను తమకు తెల్పిన చతుర్ముఖుని మునులు కీర్తించి తమ కృతజ్ఞతను తెలిపారు. తనను పొగడిన మునులను చూచి చతుర్ముఖుడు "ఓ మునులారా! శ్రీమన్నారాయణుడు స్వాయంభువమన్వంతరం మూడవ పాదంలో వైశాఖమాసం పౌర్ణమి తిథి స్వాతీ నక్షత్రంతో కూడిన శుక్రవారం నాడు ప్రాతఃసంధ్యాసమయంలో గడియమాత్రకాలంలో ఈ పర్వతంపై యోగనరసింహస్వామి రూపంలో ఆవిర్భవించాడు. తనను సేవించేవారికి గడియ కాలంలో మోక్షాన్ని ఇస్తాడు కనుక, ఈ పర్వతానికి ఘటికాచలమనే పేరు వచ్చింది" అని అన్నాడు.

ఏకశిలాపర్వతశిఖరంలో ఆవిర్భవించి, గడియకాలంలో మునులకు మోక్షాన్ని ఇచ్చి, హేమకోటివిమానం క్రింద యోగాసనంలో వేంచేసి ఉండే శ్రీనృసింహస్వామిని



# అనుబంధం

**ఘటికాశబ్దనిర్వచనము :**

వశిష్ఠుడు మొదలగు సప్తర్షులకు గడియ కాలముననే స్వామి సాక్షాత్క రించుటచే ఈ క్షేత్రమునకు ఘటికాచలమని పేరు వచ్చెనని పురాణ కథనము. అట్లే, గడియమాత్రకాలములో ఇచటి భగవానుని దర్శనము మోక్షార్థప్రదాయకము. కావునను ఘటికాచలమని పేరు వచ్చెనట. ఈ విషయమును **"ఘటికామాత్రతో యస్మా న్మహర్షీణాం కరస్థితా, ముక్తి రస్మా దముం ప్రాంచః శంసంతి ఘటికాచలమ్"** అని, **"యతో హేమశిలాపృష్ఠే హరి రావిర్బభూవ హ, ఘటికాతోషిత స్తస్మాత్ ఘటికాచలనామభాక్"** అనియు గల ఘటికాచలమాహాత్మ్య ప్రమాణములు తెలుపుచున్నవి. తెనాలి రామకృష్ణకవి ఘటికాచలమాహాత్మ్యము అను కావ్యములో ఘటికాచలశబ్దమును నిర్వచించుచూ **"స్ఫటికాక్షసరము జేకొని ఘటికామాత్రము జపింప, ఘనమగు సిద్ధుల్ ఘటియింపజేయు, దానిన్ ఘటికాద్రిని నచలభక్తి గనుగొని యచటన్"** అని పల్కెను. పరమయోగవిలాసమున **"మనుజసింహుడు మున్ను మహి నప్తమునులు వనిబూని గడియ తపంబు గావింప నటవచ్చి ప్రత్యక్షమైనట్టివాడు ఘటికాచలేశుండు హంసగమన"** అని కలదు.

**ఘటికాద్రి స్వరూపము** : ఘటికాచలమాహాత్మ్యములో ఈకొండయొక్క స్వరూపము, వైభవమును అతిరమణీయముగా వర్ణింపబడినవి. సాక్షాత్తు భగవానుడే ఈ పర్వతముయొక్క గొప్పతనమును తెల్పుచు ఇట్లనెను. **"హనుమత్పర్వతో నామ తత్రాస్తే మమ వాసభూః, చతుర్దశాస్య శృంగాణి ప్రసేవ్యంతే మహర్షిభిః, తేషు ద్వే శిఖరే రమ్యే సనకాదినిషేవితే, తత్ర దక్షిణశృంగాగ్రే మమైవ భవనం విదుః, తత్ర బ్రహ్మర్షిదేవర్షి పూజితం భవసేవితమ్, హిరణ్మయం తద్విమానం హేమకోటీతి విశ్రుతమ్"**. అట్లే వేరొక సందర్భమున ఈ పర్వతము పదునాల్గు శిఖరములను కల్గినదని తెలుపబడినది. **"చతుర్దశాస్య శృంగాణి పర్వతస్య మహామునే, పూర్వస్యాం దిశి చత్వారి సామాన్యస్య మహీభృతః, ఉత్తరస్యాం దిశి త్రీణి పశ్చిమస్యాం తథా దిశి, దిశ్యేకం దక్షిణస్యాం వై త్రీణీశానదిశి స్వయమ్"** అను వచనమును బట్టి తూర్పుదిక్కున నాల్గు, ఉత్తరదిక్కున మూడు, పడమటి దిక్కున మూడు, అట్లే దక్షిణదిక్కులో ఒకటి, ఈశాన్యమున మూడు శిఖరములను

- మొత్తం పదునాల్గు శిఖరములను ఈ పర్వతము కల్గియున్నదని తెలియుచున్నది. మరియు ఈ పర్వతము కృతయుగమున స్వర్ణమయమని, త్రేతాయుగమున వెండిపర్వతమని, ద్వాపరయుగమున తామ్రరూపమని, కలియుగమున శిలామయ మనియు **"కృతే చామీకరమయః త్రేతాయాం రజతాత్మకః, ద్వాపరే తామ్ర రూపేణ కలౌ భాతి శిలామయః"** అను ఘటికాచల మాహాత్మ్యవచనమునుబట్టి ఏర్పడుచున్నది.

## ఘటికాద్రిపై యోగనరసింహుని ఆవిర్భావము :

ఘటికాద్రి మాహాత్మ్యములో యోగనరసింహస్వామి ఆవిర్భావమునకు గూర్చిన వివరము **"స్వాయంభువే కృతే పాదే త్రితయే మునిసత్తమాః, నిజర్క్షే శుక్లపూర్ణాయాం భార్గవే మాసి మాధవే, ఉత్తమాయాం తు సంధ్యాయాం ప్రాతస్తన్యా మహస్స్ర్శి, ప్రహ్లాదప్రీతయే యోగభావేన భగవాన్ హరిః"** అని తెలుపబడింది. దీనినిబట్టి స్వాయంభువ మన్వంతరములో మూడవపాదమున వైశాఖమాసము పౌర్ణమితిథిలో స్వాతీనక్షత్రముతో కూడిన శుక్రవారమునాడు ఉదయ సంధ్యాసమయమున ఘటికాద్రిపై శ్రీనృసింహస్వామి ఆవిర్భవించెనని తెలియు చున్నది.

ఘటికాచలములో స్వామి వెలసిన వృత్తాంతములు మూడు బాగా ప్రచారములోనున్నవి. 1. శ్రీమహావిష్ణువు హిరణ్యకశిపుని సంహరించిన పిదప ఆ రూపముతోనే క్షీరాబ్ధిని చేరి, యోగనిద్రలోనుండెను. అప్పుడు ప్రహ్లాదుడు స్వామిని సమీపించి, ఆ రూపముతోనే ఘటికాచలముపై వేంచేయమని ప్రార్థింపగా, నృసింహస్వామి అచట వెలసెను. 2. ఇంద్రద్యుమ్నుడు అను రాజు దేవేంద్రునకు సహాయపడ గోరి, రాక్షసులతో యుద్ధము చేసెను. అపుడు ఇంద్రుని ప్రార్థనపై నృసింహుడు హనుమంతుని ఇంద్రద్యుమ్నునకు సహాయముగా పంపెను. ఆ యుద్ధములో ఇంద్రద్యుమ్నుడు కుంభ, నికుంభాది అసురులను ఘటికాచలములో వధించెను. అంతవరకు కుంభుని బారిలోనున్న ఆ పురము అసురుల మరణముతో ఆపదనుండి విముక్తిని పొందుటచే, స్వామి సంతోషించి అచట వెలసెను. 3. ఉత్తరమధురానగరమును పాలించు ఇంద్రద్యుమ్నుడు ఒకనాడు జింకను వేటాడుచూ ఘటికాచలప్రాంతమునకు వచ్చెను. అచట అతడు ఒకలేడిపై బాణమును గురిపెట్టి ప్రయోగింపగా, అతనికి అచట ఒక పెద్ద జ్యోతిస్సు కన్పించెను.



అప్పుడు ఆతనికి తాను చేయునది జీవహింస అని, మనస్సున తోచినది. ఆనాటి నుండి అతడు జీవహింస చేయుట మానెను. అట్లే, ఒకానొక సమయమున కుంభోధరుడను రాక్షసుడు ఘటికాచలప్రాంతమున నివసించుచుండెను. అతడు పరమ క్రూరుడు. కాని ఘటికాచలనివాస ప్రభావముచే క్రమముగా అతడు సాత్వికుడయ్యెను. ఘటికాచలములోనున్న ఆంజనేయస్వామి నృసింహస్వామి ఆజ్ఞతో అతనిని ఇట్లు మార్చెను. తన మాటను అనుసరించి అతనిని ఇట్లు మార్చిన ఆంజనేయుని అనుగ్రహించి, నృసింహస్వామి ఆంజనేయుని తన సమీపమున నివసించమని పలికి శంఖచక్రములను కూడా బహూకరించెను. శ్రీమన్నారాయణునకు మిక్కిలి ప్రీతికరములైన స్థలములలో ఘటికాద్రి రెండవది అని ఘటికాచలమహాత్మ్యములోని **"ఆది మాశ్రమము నారాయణగిరి నారాయణీనామ నల రెండవది ఘటికాచలంబు"** అను సూక్తి వలన తెలియుచున్నది.

## యోగనరసింహస్వామి రూపము :

యోగనరసింహస్వామి విగ్రహమును గూర్చి స్పష్టమైన వివరములు ఆగమములలో కన్పించుటలేదు. సామాన్యముగా ఈ మూర్తి కూర్చున్న భంగిమలో కుడి కాలు ఎడమ వైపుకు, ఎడమ కాలు కుడి వైపుకు మడువబడిన, యోగపట్టముతో అలంకరింపబడియున్న సన్నివేశమున ఉండును. ఈ మూర్తి కొన్నిచోట్ల ద్విభుజుడుగా, మరికొన్నిచోట్ల చతుర్భుజుడుగా కన్పించుచున్నాడు. కుడిహస్తమున చక్రము, ఎడమ చేతిలో శంఖమును ధరించియుండును. ఘటికాద్రి నృసింహమూర్తికూడా ఇట్టి సన్నివేశముననే వేంచేసియున్నాడు.

## షోళింగర్‌లోని నృసింహాలయము :

ఇట్టి యోగనృసింహమూర్తి ఆలయములు ఆసేతుహిమాచలము అనేకముగా వెలసినను, ప్రస్తుత తమిళనాడు రాష్ట్రములో ఆర్కాటుజిల్లాలోనికి చెందిన చోళసింహపురములో అనాదిగా వెలసిన శ్రీయోగలక్ష్మీనృసింహస్వామివారి ఆలయము సుప్రసిద్ధమైనది. ఈ స్వామి నెలకొని యున్న కొండకు అభిముఖముగా తూర్పుదెసలో హనుమానుడు వేంచేసి యుండి, స్వామిని అంజలిముద్రతో సేవించుచున్నాడు. ఇచటి నృసింహమూర్తిని, ఉద్దేశించియే దేవరాజగురువు అనబడు శ్రీవైష్ణవాచార్యులు అమృతఫలావళిశతకమను స్తోత్రమును అనుగ్ర హించిరి. ఇచటి

స్వామిని అత్రి, కశ్యపుడు, వశిష్ఠుడు, జమదగ్ని, గౌతముడు, భరద్వాజుడు, విశ్వామిత్రుడు అను ఏడుగురు సప్తర్షులు సేవించి, ధన్యులైరి. అట్లే, ప్రహ్లాదుడు, విప్రశేఖరుడు, కామదేవుడు, దూర్వాసుడు, ఉగ్రతపస్సు, ఔద్దాలికుడు మొదలగు పలువురు భక్తులు ఆరాధించిరి. శ్రీవైష్ణవ సంప్రదాయమునకు చెందిన పూర్వాచార్యులలో నాథమునులు, ఆళవందార్, తిరుక్కచ్చినమ్బి, భగవద్రామానుజులు, శ్రీమణవాళమహామునులు మొదలగువారు ఈ క్షేత్రమును సేవించిరి.

ఘటికాచలమనబడు ఈ క్షేత్రము వేలూరుజిల్లాలో కలదు. 108 శ్రీవైష్ణవ క్షేత్రములలో ఇది ఒక్కటియే వేలూరు జిల్లాలో కలదు. దీనికి షోళింగర్ అను పేరుకూడ కలదు. మద్రాస్-బెంగుళూరు రైలుమార్గములో అర్కోణమునకు పడమరగా 27 కి.మీ. దూరమున, తిరుపతి-మద్రాస్ రైలుమార్గములోని తిరుత్తణికి 27 కి.మీ. దూరమున కలదు. చిత్తూరుపట్టణము నుండియు ఈ క్షేత్రమునకు చేరవచ్చును.

షోళింగర్ పేరుతో వ్యవహరింపబడు పట్టణమునకు 3 కి.మీ. దూరములో కొండపాళెం అను గ్రామమున్నది. ఇచటనే పెద్దకొండ అనబడు శ్రీయోగలక్ష్మీ నరసింహస్వామి కొండ, చిన్నకొండ అనబడు శ్రీయోగాంజనేయస్వామి కొండయు కలవు. షోళింగపురములో భక్తవత్సలుడని, భక్తోచితస్వామి అని, తక్కాన్ అని కీర్తింపబడు ఉత్సవమూర్తి వేంచేసియున్న ఆలయము కలదు. ఆ ఆలయమునకు నాల్గు వైపుల పూర్వకాలమున నిర్మింపబడిన మాడవీధి ఒకటి కలదు.

తదనంతరకాలమున దొడ్డయాచార్యులవారు (మహాచార్యులు) అను మహనీయులు షోళింగర్ గ్రామమును క్రమబద్ధీకరించుటయేకాక, శ్రీస్వామి సన్నిధిని పునర్నించి, పలు ఉత్సవములను వైభవముగా జరుగునట్లు ఏర్పాట్లు కావించిరి. మఱియు పెద్దకొండ, చిన్నకొండలపై గల ఆలయములను పునరుద్ధరించి, అచట నిత్యపూజాదులను, ఉత్సవాదులను విశేషముగా జరిపించిరి. ఇచట మొదట స్వామి కోవెల ప్రతిష్ఠ క్రీ.శ. 1588 వ సం॥లో జరిగినట్లు ఆధారములు కలవు. దొడ్డయాచార్యులవారే ఈ క్షేత్రములోని మొదటి ఆచార్యపురుషులు. వీరు భగవద్రామానుజుల మేనల్లుడగు దాశరథి (ముదలియాణ్డాన్) వంశస్థులు. వీరు తమ శిష్యుల సహాయసహకారములతో శ్రీస్వామికి పలు ఆభరణములను, వాహనములను, వస్త్రాదులను సమర్పించిరి.



## శ్రీయోగలక్ష్మీనరసింహస్వామివారి కొండ :

కొండపాళెం గ్రామంలో ఉన్న పెద్దకొండపై శ్రీయోగలక్ష్మీనరసింహస్వామి ఆలయమున్నది. ఈ ఆలయము 200అ. పొడుగును, 150 అ. వెడల్పును కల్గి, సుమారుగా ఒక ఎకరము విస్తీర్ణములో విస్తరించియున్నది. కొండ ఎత్తు 750 అడుగులు.

పెద్దకొండ ఎక్కగానే అందమైన గాలిగోపురం ముందుగా దర్శనమిచ్చును. అచటి నుండి నాల్గు పక్కల చూచినపుడు పచ్చగా కళకళలాడు పర్వతములు, వాని మధ్య వెలసిన గ్రామములు కనులకు ఇంపుగొల్పును. ప్రదక్షిణ దిశలో లోనికి ప్రవేశించగానే పెద్ద బలిపీఠము, ధ్వజస్తంభమును కన్పించును. చాలా కాలముగానున్న ధ్వజస్తంభము పాతబడిపోవుటచే, దాని స్థానమున ఈమధ్య కాలములోనే నూతనధ్వజస్తంభము భక్తుల సహాయసహకారములతో స్థాపింపబడినది. ఇది ఒక్కటియే ధ్వజస్తంభము. ఊరిలో నున్న భక్తవత్సలస్వామి సన్నిధిలో వేఱొక ధ్వజస్తంభము లేదు. కొండపై నున్న ఆలయమే ప్రధానమగుటచే అచటనే ధ్వజస్తంభమున్నది. ఆలయములో మొదట అమ్మవారి సన్నిధి కలదు. పూర్వము అమ్మవారి సన్నిధి, పెద్దకొండ మెట్లదారిలో ఉండెడిది. అచట రక్షణ లేకుండుటచే తరువాతి కాలమున స్వామి ఆలయములోనే అమ్మవారి మూలమూర్తి, ఉత్సవమూర్తియును ప్రతిష్ఠింపబడినవి. తాయార్‌కు అమృతఫలవల్లి అని, సుధావల్లి అని పేర్లు. అమృతలతామూలమున ఉద్భవించిన అమ్మవారికి అమృతవల్లి అను పేరు సప్తర్షులచే పెట్టబడినట్లు ఘటికాచల మాహాత్మ్యము**"తథాఽ మృతలతామూలే సముత్పన్నా మనిందితామ్, దుగ్ధాబ్దిజాం తు తాం దృష్ట్వాఽ మృతవల్లీశ్వరీతి వై, నామధేయం తదా చక్రుః ఋషయః బ్రహ్మవాదినః"** అని తెల్పినది. తెనాలి రామకృష్ణకవి ఇచటి అర్చామూర్తికి భక్తోచిత, అమృతఫలనామములు కలవనుటను **"అమృతము మోక్షము తత్ఫలమమరిచి యమృతఫలనామ మందితి ధరణిన్, శ్రమయుక్తభక్తకాంక్షిత మమరిచి భక్తోచితాఖ్య నటు గైకొంటిన్"** అను పద్యము ద్వారా తెలియజేసెను. తాయార్ విగ్రహము తూర్పుముఖముగా కూర్చున్న సన్నివేశమున నున్నది. తాయార్ సన్నిధి దాటి ఉత్తరదిశగా లోనికి పోయినచో స్వామి సన్నిధి ఉన్నది. ముందుగా ద్వారపాలకుల విగ్రహములు కన్పించును. ఇవి స్వామి గర్భాలయమునకు ఎదురుగానున్న మండపమునకు వెలుపల ఉత్తరదిశలో

దక్షిణముఖముగానున్నవి. వానికి నమస్కరించి ప్రదక్షిణముగా వచ్చి దక్షిణద్వారము ద్వారా లోనికి ప్రవేశించినచో స్వామి సన్నిధిలో ముందున్న మండపము ఉపరితలము, గోడలును వర్ణచిత్రములతో అలంకరింపబడి యుండుటను గమనింపవచ్చును. ఈ చిత్తరువులు సమీపకాలమున చిత్రింప బడినవి. స్వామికి ఎదురుగా రెండు ఱెక్కలను కల్గి, అంజలిబంధముతో నిలచియున్న గరుడుని శిలావిగ్రహము కలదు. ఆ విగ్రహమునకు వెనుక గోడకు ఒక చిన్న కిటికీ కలదు. ఆ రంధ్రమునుండి చూచినచో ఎదురుగా నున్న చిన్నకొండ కన్పించును. చిన్నకొండపై వెలసియున్న యోగాంజనేయస్వామి నేత్రములు నేరుగా పెద్దకొండపై వేంచేసి యున్న నరసింహస్వామి పాదములను సేవించు చున్నట్లున్నవని పెద్దలందురు. గర్భాలయములో శిలారూపములో యోగలక్ష్మీనరసింహస్వామి మూర్తి వెలసియున్నది. క్రిందనున్న పీఠముపై లక్ష్మీనరసింహస్వామి విగ్రహమున్నది. శ్రీయోగలక్ష్మీనరసింహస్వామి సింహముఖుడు. తూర్పుముఖముగా యోగాసన ములో కూర్చున్న భంగిమలో నున్నాడు. సాలగ్రామములను అలంకరించుకొని యున్నాడు. యోగపీఠములో దశావతార పట్టమున్నది. స్వామి పాదములలో సూర్యచంద్రులు నిత్యవాసము చేయుచుందురని ప్రతీతి. సప్తర్షులకు ఘటికాకాల మాత్రముననే దర్శనమిచ్చినట్లు పురాణప్రసిద్ధి. చిన్నకొండపైనున్న హనుమానునకు శంఖచక్రములను ప్రసాదించినవాడు ఈ స్వామియే. విమానము హేమకోటి. పిమ్మట ఆదిశేషుడు, చక్రత్తాళ్వార్లు, కృష్ణుడు, గరుడాళ్వార్లు మొదలగు వారి మూర్తులు, ఆపిమ్మట వరుసలో మత్రెయాయ్ విరిన్ద విళక్కు, పుక్కాన్, మిక్కాన్ అను మూర్తులు కలవు. శిలాపుష్కరిణి అను తీర్థము ఆలయమునకు వెనుకవైపున నున్నది. ఈ కొండకు ఘటికాద్రి, హనుమత్పర్వతము, ఏకశిలాపర్వతము మొదలగు పేర్లున్నవి. స్వామికి అభిముఖముగా విష్వక్సేనులు, శ్రీరామానుజుల మూర్తులు కలవు. వీరికి పిమ్మట సప్తర్షులు, గరుడుడును కలరు.

ప్రతి శుక్రవారము స్వామికి, అమ్మవారికిని అభిషేకము జరుగును. ఇందులకు కారణము ఘటికాచల మాహాత్మ్యములో **"భృగువారే శ్రియా సంగో మమ జాతో మహాసురాః, విశిష్య భృగువారే తు స్నాతవ్యం నియమాదితః"** అని తెలుపబడినది. మరియు స్వామి, అమ్మవార్ల ఆవిర్భావములు శుక్రవారమున జరుగుట కూడా ఇందులకు ఒక కారణము కావచ్చును. అపుడు అర్చామూర్తులపై సమర్పించిన పాలు, పెరుగు, తేనె, చక్కెర, పండ్లు మొదలగువాని మిశ్రమమునకు పంచామృత మని పేరు. ఇది భక్తులకు ప్రసాదముగా ఇవ్వబడును. శుక్రవారము నాడు సేవార్థులెవ్వరైనను సొమ్ము కట్టినచో ఉత్సవము జరుపబడును. కార్తికమాసమున స్వామి యోగమునుండి బయటకు వచ్చునని, అపుడు అతడు విశేషఫలప్రదుడని పెద్దల సూక్తి, భక్తుల నమ్మికకూడా.



**చిన్నకొండ :-** పెద్దకొండకు తూర్పుదిశలో ఎదురుగా ఈ కొండ కలదు. దీనిపై గల ఆలయము 150 అ.పొ, 250 అ. వెడల్పును కల్గి యున్నది. కోవెల 1 ఎకరము వైశాల్యములో కట్టబడియున్నది. కొండ ఎత్తు 350 అడుగులు.

చిన్నదైనను అందమైన ఈ కొండపై శ్రీయోగాంజనేయస్వామి కోవెల యున్నది. ఈ ఆలయము గోపురద్వారమునకు ఎదురుగా నున్న మెట్లదారిలో గల శిలాశాసనముల వలన పూర్వము ఇచటి స్వామికి నివేదించిన ప్రసాదము ఎట్లు వినియోగింపబడినదో తెలియుచున్నది. గోపురద్వారమును దాటిప్రదక్షిణ ముగా లోనికి ప్రవేశించినచో కుడివైపు ఆంజనేయస్వామి సన్నిధిని సేవింపవచ్చును. గర్భాలయములోని ఆంజనేయస్వామి మూలమూర్తి పశ్చిమముఖుడై శాంత రూపియై, పెద్దకొండపైనున్న శ్రీనృసింహస్వామిని ధ్యానించుచున్న సన్నివేశము భక్తుల మనస్సులను, కన్నులను పరవశింపచేయును. అచటినుండి పడమటిదిశగా ఎదురుగా చూచిన పెద్దకొండపై నున్న శ్రీనృసింహస్వామి కోవెలలోని ధ్వజస్తంభము దర్శనమిచ్చును. యోగాంజనేయస్వామి మూలమూర్తి చతుర్భుజుడు. ఒక చేతిలో శంఖమును, వేరొక చేతిలో చక్రమును, మరిరెండు చేతులలో జపమాలను, జపముద్రను కల్గి కూర్చున్న భంగిమలో నున్నాడు. ఈ శంఖచక్రములను నృసింహస్వామి హనుమానునకు అనుగ్రహించిన వృత్తాంతము ఘటికాచల మాహాత్మ్యములో కలదు. ఔద్దాలిక, వామదేవాది మహర్షులను అనుగ్రహించి, వారి కోటికలను తీర్చిన వృత్తాంతమును సూచించు చిఱునగవుతో విలసిల్లు చున్నాడు. ఉత్సవమూర్తినిల్చున్న సన్నివేశములో మూలమూర్తి వలెనే చతుర్భుజుడై శంఖచక్రాదులను కల్గియున్నాడు. ప్రతిదినము అభిషేకము, ఆదివారమునాడు విశేషమైన అభిషేకమును జరుగును. కార్తిక మాసమున స్వామి విశేషానుగ్రహ ప్రదుడు. ఆంజనేయస్వామి సన్నిధికి దక్షిణదిశలో ఒక కోనేరు, ఆ కోనేటికి తూర్పుదిశలో శ్రీరామర్ సన్నిధియొక్క ముఖమండపమును కలవు. హనుమానుని

కొఱకు శ్రీరాముడు సీతాలక్ష్మణసమేతుడై ఈ కొండపై నివసించి, ఇచటి కోనేటిలో స్నానమొనర్చినట్లు పురాణప్రసిద్ధి. **"పురా నిహత్య రక్షాంసి రామః శస్త్రభృతాం వరః . . . . నిర్మలే తు శిలాపృష్ఠే సముల్లసతి వారిణీ, హనుమతాభిలషితః స్నానం చక్రే రఘూత్తమః"** అనుచూ ఈ విషయమును ఘటికాచల మాహాత్మ్యము పేర్కొన్నది. కావున ఈ కోనేటికి రామతీర్థమను పేరు కలదు. అట్లే హనుమత్తీర్థము, చక్రతీర్థమను పేర్లను దీనికి కలవు. రామర్ సన్నిధికి పోవు దారిలో గర్భాలయము నకు ముందు ద్వారపాలకుల విగ్రహములు కలవు. ఆ గర్భాలయములో శ్రీరాముడు, లక్ష్మణుడు, సీతాదేవి నిలుచున్న భంగిమలో నున్నారు. మూలమూర్తుల, ఉత్సవవిగ్రహములతోపాటు పెద్దకొండపైవలె శ్రీకృష్ణుడు, చక్రత్తాళ్వార్, ఆదిశేషుడు మొదలగువారి తామ్రవిగ్రహములును సేవింపవచ్చును. పిమ్మట శ్రీరాముని కులదైవమగు శ్రీరంగనాథుని సన్నిధి కలదు. ఇచట రామర్ సన్నిధికి తప్ప వేరొక సన్నిధికి ద్వారపాలకులు లేకుండుట గమనింపతగినది. శ్రీరంగనాథుని మూలమూర్తి పరుండియున్న భంగిమలో, ఉత్సవమూర్తి ఉభయదేవేరులతో నిలుచున్న సన్నివేశములో నున్నారు. ఇచటి కోనేటిలో మత్స్యసమృద్ధి అధికము. తమ జాతినాయకుని నివాసమను కారణముచే కాబోలు, ఇచట వానరసమూహము మెండు. సుమారు 60 సంవత్సరములకు పూర్వము ఇచటి కొండపై కొండముచ్చులు అను వానరజాతి ఎక్కువగా ఉండెడిదట. రెండవ ప్రపంచయుద్ధకాలమున నీగ్రోజాతివారు ఈ కొండసమీపమున మకాము చేసినపుడు వానిని వారు నిర్దాక్షిణ్యముగా వధించుటచే అవి నిర్మూలమగుట శోచనీయము. పిశాచాది గ్రహబాధలు కలవారు శ్రీయోగాంజనేయస్వామిని కొలిచి, తమను రక్షింపుమని వేడుట ప్రత్యక్షముగా కన్పించును.

## భక్తవత్సలస్వామి సన్నిధి :

ఈ ఆలయము 300 అ.పొడుగు, 150 అ. వెడల్పును కల్గి 2 1/2 ఎకరముల విస్తీర్ణములో కట్టబడియున్నది. ఇది షోళింగర్ ఊరికి నడిబొడ్డున చతురస్రాకారములోనున్నది. కోవెలకు ముందున్న రథము భక్తుల చూపును ముందుగా ఆకర్షించును. ఆలయమునకు ఎదురుగా నున్న వీధిలో చివరగా పూర్వము రథమండపము ఉండెడిది. చాలకాలము అచటనే ఉన్న రథము ఏకారణమువలననో ఇటీవలి కాలమున ఆలయమునకు సమీపమునకు తీసికొనిరాబడినది. కోవెల



గోపురద్వారమునకు ఎదురుగా బలిపీఠమున్నది. దానికి ఎదురుగానున్న ఎత్తైన ప్రదేశమున స్వామి పాదములు శిలారూపములో నున్నవి. ఎపుడో ఆలయనిర్మాణపు పనులు చేసినపుడు ఇవి ఏర్పడియుండవచ్చును. గోపురద్వారమునకు కుడివైపున వంటశాల కలదు. దానికి ఎదురుగా నున్న మండపములో రాపత్తు, పకల్‌పత్తు మొదలగు ఉత్సవములు జరుగును. ఇందలి స్తంభములు మిక్కిలి పెద్దవి. చక్కని శిల్పములతో మనోహరములైయున్నవి. దానికి ఎదురుగా చివరలో నున్న గోడపై తొలచిన శ్రీరంగనాథుని రూపము కలదు. ఈ మూర్తికి పూర్వము ఆరాధన జరిగెడిదట. ఈ మండపమునకు దగ్గరలో ఒక సన్నిధి కలదు. ఇపుడందు ఏవిగ్రహమును లేదు. భక్తవత్సల స్వామి సన్నిధికి వెనుక భాగమున ఆదికేశవ స్వామి సన్నిధి కలదు. అందు ఆదికేశవస్వామి విగ్రహము ఉన్నతమైన ఉభయదేవేరుల మూర్తులతో తూర్పుముఖముగా నిలచి యున్న సన్నివేశమున నున్నది. పెద్దకొండకు, చిన్నకొండకు పోయి సేవ చేయలేని వారు ఈస్వామిని కొలచిన కోరికలు ఈడేరునని పెద్దల సుద్ది. ఈ స్వామికి సహస్రకలశాభిషేకము జరిపిన సువృష్టి కురిసి, దేశమును సుభిక్షమగునని భక్తుల నమ్మిక. ఈ స్వామికి ఎదురుగా రాతితో చెక్కబడిన పెద్ద గరుడుని రూపము కలదు. గర్భాలయమునకు ముందు ద్వారపాలకుల విగ్రహములున్నవి. గర్భాలయమునకు సమీపమున ఏ విగ్రహమును లేని సన్నిధి ఒకటి ఉన్నది. అందు పూర్వము శివలింగము ఉండెడిదని, స్థలాచార్య పురుషులైన దొడ్డయాచార్యులవారి కాలమున ఊరికి తూర్పుదిశలో కట్టబడిన ప్రత్యేకమైన ఆలయమునందు అది ప్రతిష్ఠింపబడెనని జనవాక్యము. రెండవ మైసూరు యుద్ధము క్రీ.శ. 1781వ సం॥లో జరిగినది. అపుడు ఇచటి ఉత్సవమూర్తులను కొండపై దాచి ఉంచిరట.

భక్తవత్సలస్వామి సన్నిధికి ఎదురుగా నున్న పెద్దరాతి మండపమునకు రంగమండపము అని పేరు. ఆ మండపములోపల కప్పుపై భాగమున పూర్వము వర్ణచిత్రములు వ్రాయబడిన గుర్తులున్నవి. కాలక్రమమున అవి మాసిపోయి, రూపు కోల్పోవుటచే స్పష్టముగా ఇపుడు గోచరింపవు. గర్భాలయమునకు ముందు ద్వారపాలకుల విగ్రహములు కలవు. శేషవాహనములో ఉభయనాచ్చిమార్లతో నిలచియున్న భంగిమలో స్వామి చతుర్భుజుడై దర్శనమిచ్చును. నాల్గు హస్తములలో

శంఖము, చక్రము, ఆహ్వానముద్ర, అభయముద్ర కలవు. ఇచటి శఠారిపై ఆదిశేషునిరూపము యుండుట విశేషము. స్వామికి కుడివైపున పంచలోహమయ మైన శ్రీకృష్ణుని విగ్రహమున్నది. వేఱొక వైపు వరదరాజస్వామి విగ్రహమున్నది. దొడ్డయాచార్యులవారిని భక్తవత్సలస్వామి గర్భాలయమునకు ప్రదక్షిణము చేసివచ్చునపుడు గోదాదేవి సన్నిధిని సేవింపవచ్చును. అందు గోదాదేవి మూలమూర్తి, ఉత్సవమూర్తులు కలవు. ఆ సన్నిధికి తూర్పుగా వచ్చినచో ఆళ్వార్ల, ఆచార్యుల లోహ విగ్రహములను సేవింపవచ్చును. నాథమునులు, శ్రీయామునులు, ముదలియాణ్డాన్, తిరుక్కచ్చినమ్బి, భగవద్రామానుజులు, ఎమ్బార్, కూరేశులు, పిళ్లైలోకాచార్యులవారు, శ్రీమణవాళమహామునులు, ఎఱుమ్బియప్పా, దొడ్డయాచార్యులవారు - అను మహనీయుల విగ్రహములు కలవు.

**గోపురవిశేషములు :**

పెద్ద కొండపై శ్రీయోగలక్ష్మీ నరసింహస్వామి కోవెలముఖద్వారమున ఉత్తరముఖముగా అందమైన రాజగోపురమున్నది. 5 అంతస్థులతో, 7 కలశములతో కూడుకొనియున్న ఈ గోపురము 50 అ. ఎత్తును, 226 అడుగుల నిడివిని కల్గియున్నది. చిన్న కొండపై ఉత్తరముఖముగా గల రాజగోపురము మూడు అంతస్థులతో, 5 కలశములతో నున్నది. ఇది 316 ఎత్తు, 146 అడుగుల వెడల్పును కల్గి యున్నది. ఊరిలో నున్న భక్తవత్సలస్వామి ఆలయరాజగోపురము తూర్పుదిశగా నున్నది. ఇది 5 అంతస్థులను, 7 కలశములను కల్గి, 90 అ. ఎత్తులో, 35 అ. వెడల్పుతో అలరారుచున్నది.

**విమానములు :**

పెద్దకొండపై శ్రీ నరసింహస్వామి గర్భాలయమునకుపైన కట్టబడిన విమానమునకు హేమకోటి విమానము అని పేరు. దానిపై ఒక కలశము అమర్చబడి యున్నది. తాయారు సన్నిధికి గల విమానముపై కూడా ఒక కలశము కలదు. చిన్నకొండపై గల ఆంజనేయస్వామి, రామర్, రంగనాథస్వామి ఆలయములపై ఒక్కొక్క కలశములతో విమానములు దర్శనమిచ్చును. కొండపాలెంలోని భక్తవత్సలస్వామి గర్భాలయముపై మూడు కలశములు గల విమానము, దానికి ఎదురుగా నున్న గరుడుని సన్నిధిపై ఒక కలశమును గల విమానమును కలవు.



**ప్రాకారములు :**

పెద్దకొండపై బయటి ప్రాకారము సుమారు 15 అ. వెడల్పు, 200 అ. పొడుగు కల్గినది. తాయార్‌సన్నిధి ప్రాకారము సుమారు 10 అ. వెడల్పు, 75 అ.పొ., శ్రీస్వామికోవెల ప్రాకారము 15 అ. వెడల్పు, 80 అ. పొడుగును, రామర్ సన్నిధి ప్రాకారము 6 అ.వెడల్పు, 18 అ. పొడగును, హనుమానుని సన్నిధిప్రాకారము 6 అ.వెడల్పు, 75 అ. పొడుగును కల్గియున్నవి. శ్రీభక్తవత్సలసన్నిధిలో బయటి ప్రాకార మొకటి కలదు. అది ఇపుడు ఉపయోగములో లేదు. లోపలి ప్రాకారము పొడుగు 200 అ., వెడల్పు 20 కల్గియున్నది. భక్తవత్సలస్వామి సన్నిధి ప్రాకారము సుమారు 10 అ. వెడల్పును, 40 అ. వెడల్పును కల్గినది. మూలవర్ ఆదికేశవస్వామి సన్నిధి ప్రాకారము సుమారు 10 అ. వెడల్పును, 30 అ. పొడుగును కల్గినది.

**మండపములు :**

పెద్దకొండ కాలిదారి ప్రారంభమునుండి పైన గల రాజగోపురమువరకు 7 మండపములు కలవు. ఇవి అన్నియు భక్తుల సౌకర్యార్థము కట్టబడినవి. రాజగోపురమునకు ఎదురుగా ఒక నాల్గు కాళ్ల మండపమున్నది. శ్రీస్వామిసన్నిధి బయటి ప్రాకారములో ద్వాదశారాధనకు ఉపయోగించు వేఱొక నాల్గు కాళ్ల మండపమును కలదు. వంటశాలవాకిటిలో యాగశాలమండపము, వేరొక మండపమును కలవు. దారిలో తాయార్ పాతసన్నిధి బయట 16 కాళ్లమండపము కలదు. ఇది ప్రస్తుతము ఉపయోగములో లేదు. శ్రీస్వామిసన్నిధికి ఎదురుగా చిన్నఊంజల్ మండప మొకటి కలదు. చిన్నకొండ నడకదారిలో రాజగోపురము వరకు రెండు మండపము లున్నవి. చక్రతీర్థము (చిన్నకొండపైనున్న కోనేరు) చుట్టు నాల్గువైపుల మండపమున్నది. రామర్‌సన్నిధికి ఎదురుగా చక్రమండప మున్నది. భక్తవత్సలస్వామి సన్నిధిలోగల రంగమండపము చక్కని శిల్పములతో కనపడు చున్నది. ఇది చాల అందమైనది. రాపత్తు మండపము పెద్ద పెద్ద స్తంభములతో చాల అద్భుతముగా దర్శన మిచ్చును. దానికి చివరలో అందమైన ఊంజల్‌మండప మున్నది. ఇది శిల్పములతో కూడియున్నది. భక్తవత్సలస్వామి సన్నిధి ఉత్తర ప్రాకారమునకు సమీపమున అసంపూర్ణమైన పెద్ద పెద్ద ఊాతి స్తంభములను కల మండపములు కలవు. ఈ మండపములు అన్నియు విజయనగరప్రభువుల

కాలమునాటివి. కోవెలలో ఆ కాలమునకు చెందిన పలు జాతి శాసనములు కలవు. గోదాదేవి సన్నిధి బయటి గోడపై మాత్రము 1715 సం॥నాటి శాసన మొకటి కన్పించుచున్నది. శ్రీస్వామిసన్నిధికి ముందు రెండు నాల్గు కాళ్ల మండపములున్నవి. సుమారు 40,50 సం॥లకు పూర్వము వీనికి మెట్లు ఉండెడివట. మొదటి విమాన మండపములో గ్రామసంక్షేమమునకై చక్రత్తాళ్వారు వేంచేసియున్నారు.

## షోళింగర్‌లోని తీర్థములు :

1. బ్రహ్మతీర్థము, 2. పాండవ తీర్థము, 3. హనుమత్తీర్థము (చక్రతీర్థము- ఇది చిన్నకొండపై కలదు) 4. భైరవతీర్థము, 5. వజ్రతీర్థము, 6. లక్ష్మీతీర్థము, 7. గౌతమ తీర్థము, 8. శేషతీర్థము అను ఈ ఎనిమిది ముఖ్య తీర్థములు. ఇవికాక, శిలాపుష్కరిణి, ఆకాశగంగ, అగస్త్యతీర్థము, అగ్నికుండతీర్థము, సోమకుండతీర్థము, పద్మసరస్సు, రామతీర్థము, కల్హారతీర్థము, వరాహతీర్థము, పుండరీకతీర్థము, పాపనాశనము, వామపుష్కరిణి, అమృతకుండము, రత్నసరస్సు, మహాసరస్సు, సంజీవబావి, నరసింహతీర్థము, హంసతీర్థము, పంచాయుధ తీర్థము మొదలగు ఎన్నో తీర్థములు కలవు. ఘటికాచల మాహాత్మ్యములో 108 తీర్థములున్నట్లు పేర్కొనబడినది.

బ్రహ్మతీర్థముయొక్క గొప్పదనమును ఘటికాచల మాహాత్మ్యము పలు విధముల ప్రపంచించు ఇట్లు తెలిపినది. **"బ్రహ్మ స్వనామ్నా కాసారం తమకీర్తయ దుత్తరమ్, గురువారే చ యః స్నాతి సమాహితమనాః నృప మధ్యాహ్నసమయే మర్త్యాః తస్య పుణ్యఫలం శ్రుణు, అగ్నిష్టోమాధికరణే పుత్రాదికరణే తథా, యత్ఫలం బ్రహ్మసరసి, స్నాయీ తత్ఫల మశ్నుతే . . . బ్రహ్మపుష్కరిణీతీరే వృక్షా నారోపయంతి యే, అముత్ర సుఖినః సర్వే మహీయంతే పరత్ర చ"**

ప్రధాన తీర్థము అగు దీనికి తక్కాన్‌కుళమ్ అని పేరు. అనగా భక్తవత్సల స్వామి కోనేరు అని అర్థము. ఈ మధ్యకాలములో ఇది పునరుద్ధరింపబడినది. ఇది 300 అ. పొడుగును, 200 అ.వెడల్పును, 25 మెట్లను కల్గియున్నది. సేవార్థులు తమ కేశసమర్పణమును ఈకోనేటి దక్షిణ తీరముననే చేసి, స్నానము చేయుదురు. దీనిలోనే ఘటికాద్రి నృసింహస్వామికి తెప్పోత్సవము, చక్రస్నానము జరుగును. కోనేటికి ఉత్తరతీరమున వరదరాజస్వామి ఆలయమున్నది. పూర్వము గరుడసేవ



నాడు ఆ సేవను దర్శింపలేని దొడ్డయాచార్యుల వారిని కంచి వరదరాజస్వామి అనుగ్రహించి, గరుడవాహనారూఢుడై సాక్షాత్కరించెనట. ఆ సందర్భమునకు గుర్తుగా ఈ ఆలయము నిర్మింపబడినది. ఇందు వరదరాజస్వామి గరుడవాహనారూఢుడై, చతుర్భుజుడై, నాల్గు భుజములలో శంఖము, చక్రము, పద్మము, గద ధరించి, ఒక పాదమును గరుడుని భుజముపై, వేరొక పాదమును గరుడుని చేతిలోనిలిపియున్న సన్నివేశమున వెలసియున్నాడు. ఇందు శ్రీరామానుజుల మూలమూర్తి, ఉత్సవమూర్తులు కలవు. పంచలోహమయమైన రామానుజుల ఉత్సవమూర్తి శ్రీపెరుంబూదూర్‌లోని ఉత్సవవిగ్రహమును తలపించును. ఇచట దొడ్డయాచార్యులవారి శిలావిగ్రహముకూడ కలదు. చిన్నకొండకు పోవుదారిలో పాండవతీర్థము, పెద్దకొండకు పోవు దారిలో నరసింహతీర్థము, ఊరిలోని భక్తవత్సలస్వామి సన్నిధికి ఎదురుగా శ్రీనివాస పుష్కరిణి అను పేరు గల తీర్థమును కలవు.

## షోళింగర్‌లోని ఉత్సవవిశేషవివరములు :

విష్ణ్వాలయములన్నిటి యందు సమానముగా నిర్వహింపబడు ఉత్సవములు కొన్నియున్నను, ప్రతిక్షేత్రములో కొన్ని విశేషోత్సవములు జరుగును. ఘటికాద్రి క్షేత్రములో సంవత్సములోని పంద్రెండు నెలలలో జరుపబడు ఉత్సవములు కొన్ని ఇచట ప్రస్తావింపబడుచున్నవి.

**చిత్తిరనెల :** ఘటికాచల క్షేత్రములో నిర్వహింపబడు ఉత్సవములన్నిటిలో చిత్తిరమాసములో జరుగు బ్రహ్మోత్సవము మొదటిది, అతిప్రధానమైనదియు. ఈ మాసములో బ్రహ్మోత్సవము నిర్వహింపబడుటకుగల హేతువు ఘటికాచల మాహాత్మ్యములో ఈ విధముగా తెలుపబడినది. **"అత్ర సన్నిహితో లక్ష్మ్యా వసంతే సమయే త్వహమ్, తదా మమోత్సవో లక్ష్మ్యా మమ చ ప్రభవిష్యతి"** దీనిని బట్టి వసంతకాలమున అమృతఫలవల్లి అను పేరు కల్గిన అమ్మవారితో స్వామివారి కలయిక జరిగెను కావున దానికి గుర్తుగా చైత్రమాసమున బ్రహ్మోత్సవము నిర్వహింపబడుచున్నదని తెలియుచున్నది. ఈ ఉత్సవము ధ్వజారోహణముతో ప్రారంభమై, ధ్వజావరోహణముతో పూర్తియగును. ఈ రెండు దినములలోను ఉత్సవమూర్తి యగు భక్తవత్సలస్వామి కొండకు వేంచేయును. ఉత్సవ సమయములో

తొమ్మిది దినములందు ఊరిలో బలిహరణము కొఱకు చక్రత్తాళ్వార్లు రెండు వేళల కొండదిగి వేంచేయుదురు. బ్రహ్మోత్సవములో చివరి రోజగు చిత్రాపౌర్ణమి నాడు ఉత్సవమూర్తి (భక్తవత్సలస్వామి) బ్రహ్మతీర్థమనబడు తక్కాన్‌కుళమ్ వద్దకు వేంచేయును. తీర్థవారి మండపములో తిరుమంజనము జరిగిన పిమ్మట చక్రస్నానోత్సవము జరుగును. పిమ్మట భక్తవత్సలస్వామి ఎట్టి మండపమునకు వేంచేసి, **'ఎట్టి అప్పమ్'** అను ప్రసాదమును ఆరగించు ఉత్సవము. తరువాత తిరుమొళి ప్రబంధనిగమనము, తీర్థప్రసాద వినియోగము జరుగును. ఈ ఉత్సవమునకు ఒక అద్భుతమైన వృత్తాంతము కారణము. ఒకానొక సమయమున స్థలాచార్య పురుషులగు దొడ్డయాచార్యులవారిని పల్లకిలో మోయు బోయిలకు విపరీతమైన శ్రమయు, ఆకలిదాహములును కల్గినవి. వారి బాధను గమనించిన ఆచార్యవర్యులు దగ్గరలోనున్న ఎట్టి వృక్షమును తమ పాదములతో తాకి, దాని పండ్లను భుజింపవలసినదిగా బోయిలతో పల్కిరి. సహజముగా ఆ పండ్లు ప్రాణములను తీయు తీవ్రమైన విషమును కల్గినవి. కాని బోయీలు దొడ్డయాచార్యులపై గల విశ్వాసముతో ఆ ఫలములను నిస్సంకోచముగా భుజించిరి. అపుడు వారి ఆకలి దప్పులు తీరినవట. అత్యాశ్చర్యకరమైన ఈ ఉదంతమునకు గుర్తుగా ఈ ఉత్సవము జరుపబడుచున్నది. ఈ ఉత్సవ సమయమున ఈనాటికిని దొడ్డయాచార్యుల వారి వంశస్థులకు పరివట్టము, శఠారి, తీర్థము మొదలగు విశేషమర్యాదలు జరుగును. ఈ నెలలో 10 దినములపాటు జరుగు శ్రీరామానుజుల అవతారోత్సవములు కూడ పేర్కొనతగినవి.

**వైయ్యాశినెల** : ఈ నెలలో నరసింహజయంతి, వసంతోత్సవము, వైయాశి గరుడసేవ, పది రోజులపాటు జరుగు అవతారోత్సవములు ప్రధానమైన ఉత్సవములు. నరసింహ జయంతి నాడు ఉత్సవమూర్తి పెద్దకొండకు వేంచేయుదురు. సాయంకాలము సంధ్యా సమయమున నరసింహావతార ఘట్టము పఠింపబడును. మూలమూర్తికి, ఉత్సవమూర్తికిని అలంకార తిరుమంజనము, అర్చన, దివ్యప్రబంధసేవ, శాత్తుముఱై, తీర్థప్రసాద వినియోగము జరుగును. తరువాత ఉత్సవమూర్తి ఊరిలోని కోవెలకు తిరిగి వేంచేయుదురు. కంచిలో వైశాఖమాసమున జరుగు వరదరాజస్వామి బ్రహ్మోత్సవములలో మూడవనాడు గరుడోత్సవము



జరుగును. ఆనాడు ఘటికాచలమునందును **'తక్కాన్'** కు గరుడసేవ జరుగును. ఇందులకొక ఐతిహ్యము కారణము. దొడ్డయాచార్యుల వారు ప్రతియేడు కాంచీపురములో వరదరాజస్వామి గరుడవాహనోత్సవమును సేవించుచుండిరి. ఒక ఏడు అశక్తి కారణముగా కంచికి పోలేక పోయిరి. గరుడసేవ జరుగునాడు ఉదయము ఆమహనీయులు ఘటికాచలములోని బ్రహ్మతీర్థములో స్నానమాడి, కంచి గరుడసేవను దర్శించలేక పోయితిమే! అని వ్యాకులపడు చుండగా, అపుడు భక్తవత్సలుడైన వరదరాజస్వామి గరుడవాహనారూఢుడై ఆ ఆచార్యుల ముందు ప్రత్యక్షమయ్యెను. (ఈనాటికిని కంచిలో గరుడుని అధిరోహించి వరదరాజస్వామి వేంచేయునపుడు గోపురద్వారములో కొంచెముసేపు ఆగి వేంచేయుట ఈ ఉదంతమునకు గుర్తు అని పెద్దలందురు.) ఈ అద్భుతవృత్తాంతమునకు ప్రతీకగా ఘటికాచలమునందును ఆనాడు గరుడోత్సవము జరుపబడుచున్నది. అపుడు దొడ్డయాచార్యవంశీయులకు పరివట్టము, పూమాల, శఠారి అనుగ్రహింపబడును.

**ఆణిమాసము** : కొడైత్తిరునాళ్ - మూడు దినములు ఆదికేశవస్వామి వర్షతిరునక్షత్రోత్సవము (శ్రవణానక్షత్రమునాడు) మొదలగు ఉత్సవములు ఈ నెలలో జరుగును.

**ఆడిమాసము** : గోదాదేవి అవతారోత్సవములు 10 దినములు. చివరిరోజు ఉదయము గోదాదేవికి, స్వామికి అలంకారతిరుమంజనము, సాయంకాలము కల్యాణోత్సవము, వీధి ఉత్సవము జరుగును. దీనిని పూర్వము దొడ్డయాచార్యులవారి తండ్రిగారు అగు పెరియప్పజ్గార్ నిర్వహించిరని ప్రతీతి.

**ఆవణినెల** : పెద్దకొండపై పవిత్రోత్సవములు 7 దినములపాటు జరుగును. ఆ ఉత్సవములలో ప్రారంభమునాడు భక్తవత్సలస్వామి కొండకు వేంచేయును. ఈ ఏడు రోజులలో రెండు వేళల హోమము జరుగును. చివరిరోజు అగు స్వాతీనక్షత్రము నాడు పూర్ణాహుతికి పిమ్మట ఉత్సవమూర్తి మూలమూర్తి సన్నిధికి వేంచేయుదురు. పిమ్మట మూలమూర్తి, ఉత్సవమూర్తులు కలసి వేంచేసియున్నసేన, శాత్తుముఱై, తీర్థప్రసాదగోష్ఠి జరుగును. ఈ నెలలోనే శ్రీజయంతి ఉత్సవము, మరునాడు ఉట్టిఉత్సవమును జరుగును. ఉట్టి ఉత్సవమునాడు శ్రీకృష్ణునకు, భక్తవత్సల స్వామికి తిరువీథి ఉత్సవము నిర్వహింపబడును.

**పురట్టాశినెల :** నవరాత్రి ఉత్సవము ఈనెలలో ప్రధానమైనది. ఈ సమయమున అమ్మవారి ఉత్సవమూర్తి కొండపైనుండి ఊరిలోనున్న భక్తవత్సల స్వామి కోవెలకు వేంచేయును. అప్పటినుండి రెండు నెలలపాటు అమ్మవారు అచటనే భక్తవత్సల స్వామితో కలసి యుండుట విశేషము. నవరాత్రి ఉత్సవదినములలో ప్రతిరోజు అమ్మవారికి, స్వామికిని అలంకార తిరుమంజనము, సహస్రనామార్చన, కోవెలలోపల ఉత్సవమును జరుగును. విజయదశమినాడు స్వామికి అశ్వవాహ నోత్సవము జరుగును.

**అల్పిశినెల :** డోలోత్సవము అను ఊంజల్‌సేవ 5దినములు, శ్రీమణవాళ మహాముసుల అవతారోత్సము 10 దినములు జరుగును. అట్లే దీపావళి ఆస్థానము, వనభోజనోత్సవమును ఈ నెలలోనే మణవాళమహాముసుల ఉత్సవములలో చివరిరోజు అగు మూలానక్షత్రమునాడు ఉదయం పల్లకిలో మణవాళమహామునులకు తిరువీధి ఉత్సవము జరిగినపిమ్మట భక్తవత్సలస్వామికి, అమ్మవారికి, మణవాళమహామునులకును తిరుమంజనము జరుగును. సాయంకాలము భక్తవత్సలస్వామి, మణవాళ మహామునులతోపాటు నాల్గు వీథులలో ఊరేగును. తిరిగి ఆస్థానమునకు వేంచేయగానే తిరువాయ్‌మొళి గోష్ఠి, తీర్థగోష్ఠికి పిమ్మట మణవాళమహామునులకు గంధపొడి ఉత్సవమును జరుగును.

**కార్తికమాసము :** ఈ నెల విశేషమైన కాలము. ప్రతిశుక్రవారము పెద్దకొండపై, ప్రతి ఆదివారము చిన్నకొండపై తిరుమంజనము, ఉత్సవములును జరుగును. కార్తీక దీపోత్సవము, 10 దినములపాటు జరుగు తిరుమంగై ఆళ్వార్ల ఉత్సవములను ఈ నెలలో పేర్కొనతగినవి. కార్తీకదీపోత్సవమునకు తర్వాత ఉత్సవమూర్తికి తైలక్కాప్పు సమర్పింపబడును. ఇది ఇచటి విశేషములలో ఒకటి. కావున కార్తీకశుక్ల పౌర్ణమి మొదలు మార్గశీర్షశుక్ల ఏకాదశి వరకు ఉత్సవమూర్తికి తైలక్కాప్పు సమర్పింపబడియుండుటచే అభిషేకము జరగదు. కొండపై మూలమూర్తికి మాత్రము అభిషేకము, ఉత్సవమును జరుగును.

**మార్గశిరమాసము :** పకల్‌పత్తు ఉత్సవములు వైకుంఠ ఏకాదశి ఉత్సవములు, ముక్కోటి ద్వాదశి తీర్థవారి ఉత్సవము, రాపత్తు ఉత్సవములు, చివరలో నమ్మాళ్వార్ల పరమపదోత్సవము. మఱియు ఆణ్డాళ్ మార్గళినీరాట్టోత్సవము 3 దినములు జరుగును.



అధ్యయనోత్సవములు అనబడు పకల్‌పత్తు, రాపత్తు ఉత్సవములు 21 దినములపాటు జరుగును. పకల్‌పత్తు చివరిరోజున (10వ నాడు) భక్తవత్సల స్వామికి మోహినీ అలంకారము చేయబడును. ఆనాటి రాత్రి 2 గంటలకే ముక్కోటి ఏకాదశి ఉత్సవము ప్రారంభమగును. తిరుప్పావైగోష్ఠి పిమ్మట స్వామి వైకుంఠ ద్వారము ద్వారా వేంచేయును. అచట ఆరాధన, మంత్రపుష్పము మొదలగునవి విశేషముగా జరుగును. వేదము, పురాణము, శ్రీభాష్యముల పారాయణము తీర్థ కారులచే చేయబడిన పిమ్మట, వారికి మర్యాద జరుగును. పిమ్మట గరుడోత్సవము, అనంతరము స్వామికి, గోదాదేవి, ఆళ్వార్ల, ఆచార్యుల మూర్తులకు అలంకార తిరుమంజనము జరుగును.

మరునాడు ముక్కోటి ద్వాదశి. ఆనాడు శ్రీకృష్ణునకు తీర్థవారి జరుగును. తిరుప్పావై గోష్ఠికి పిమ్మట శ్రీకృష్ణునిమూర్తి బ్రహ్మతీర్థమువద్దకు వేంచేయును. అచట అలంకార తిరుమంజనము, పిమ్మట తీర్థవారి ఉత్సవము, అనంతరము తీర్థగోష్ఠి తరువాత శ్రీకృష్ణస్వామి ఆలయమునకు తిరిగి వేంచేయును.

గోదాదేవి నీరాట్ట ఉత్సవములలో మొదటి రెండు రోజులలో ధనుర్మా సారాధనకు పిమ్మట, గోదాదేవికి వీథిఉత్సవము జరుగును. మూడవనాడు భోగిపండుగరోజు సాయంకాలము గోదాదేవి దీపములను వెల్గించి, శకునమును చూచు ఉత్సవము నిర్వహింపబడును. ఇది ఈ క్షేత్రములోని విశేషము.

## తై మాసము (పుష్యమాసము) :

సంక్రాంతినాడు గోదాకల్యాణము, కనుమ పారువేట ఉత్సవము, గిరి ప్రదక్షిణము, తైమాసములో అమావాస్య మొదలు ఐదు రోజులు తెప్పోత్సవము - అనునవి ఈ మాసమున జరుగు ముఖ్యోత్సవములు. మకర సంక్రాంతి అనబడు తైపొంగల్ ఉత్సవదినమున స్వామికి, గోదాదేవికి అలంకార తిరుమంజనము జరుగును. సాయంకాలము కల్యాణము జరుగును. సామాన్యముగా అన్ని ఆలయములలో గోదాదేవి కల్యాణము భోగి పండుగనాడే జరుగును. కాని ఇచట సంక్రాంతి నాడు జరుగుట విశేషము. ఇదియును దొడ్డయాచార్యులవారి తండ్రిగారైన పెరియప్పఙ్గార్ ఏర్పరచిన ఉభయము. గోదాదేవి తిరునక్షత్రోత్సవములలో తిరువాడిప్పూరత్తిరుక్కల్యాణము, సంక్రాంతి తిరుక్కళ్యాణము, ఆళ్వార్

పరమపదోత్సవము అను మూడు రోజులలో దొడ్డయాచార్యుల వారి వంశీయులను ఇరట్టైమర్యాద జరుగును.

సంక్రాంతి మరునాడు కనుమపారువేట ఉత్సవము. ఆనాడు ఉదయముననే స్వామి మాత్రము తలపాగ, కత్తి మొదలగు వేటకు తగిన అలంకారములను దాల్చి పడమటిదిశలో వేటకు వేంచేయును. తిరిగి వచ్చినపుడు ఎఱుమ్బి అగ్రహారమునకు వేంచేసి, అచట ఆరాధన, తిరుప్పావైగోష్ఠి, తీర్థ వినియోగము జరుగును. ఈ ఉత్సవము ఇచట జరుగటకు ఒక ఐతిహ్యము కారణము. ఈగ్రామములోనే శ్రీమణవాళమహామునులు తమ శిష్యులగు ఎఱుమ్బియప్పా ప్రార్థనను అంగీకరించి ఒక నెలరోజులు తిరుప్పావై ఉపన్యాసమును అనుగ్రహించిరి. మణవాళ మహామునులు శ్రీరంగనాథుని పరమభక్తులగుటచే ఆ స్వామిని ఒకరోజుకూడ వదలి ఉండలేరు. ఒకనెల రంగనాథుని వీడియుండుట వారికి బాధాకరము. కాని ఘటికాద్రినృసింహస్వామి దివ్యమంగళవిగ్రహమును దర్శించిన ఆ ఆచార్యులు ఆమూర్తియందు విశేషప్రావణ్యమును పొందినవారై ఘటికాద్రి నృసింహస్వామికి వడతిరువరఙ్గనాథన్ అని, ఎఱుమ్బిగ్రామమునకు వడతిరువరఙ్గమ్ అని, అచటి ఏరుకు వడతిరుక్కావేరి అని, అచటి భక్తులకు అళకియమణవాళదాసులు అని పేరు పెట్టిరి. ఆ వృత్తాంతమునకు గుర్తుగా ఎఱుమ్బిగ్రామములో ఈనాటికి తిరుప్పావై సమాపనోత్సవము జరుగును. గిరి ప్రదక్షిణోత్సవమునాడు దేవేరులతో కలసి స్వామి వేంచేసి గిరి ప్రదక్షిణము చేయును. అపుడు ఏకాదశి మండపములో శేషవాహనోత్సవము జరుగుట విశేషము. పూర్వము సప్తర్షులు తైమాసములో బ్రహ్మోత్సవము స్వామికి జరిపిన వృత్తాంతమునకు గుర్తుగా ఈ ఉత్సవము జరుగుచున్నదని పెద్దలందరు.

**మాశి నెల (మాఘము) :** దవనోత్సవము మూడురోజులు, మాశి ఉత్తరాషాడోత్సవము, మాశి మఖానక్షత్రోత్సవము, తెప్పోత్సవములు మూడు రోజులు ఈ నెలలో జరుగు ముఖ్యమైన ఉత్సవములు. ఈ క్షేత్రమున ఆచార్యపురుషులైన దొడ్డయాచార్యులవారి అవతారోత్సవములు విశేషముగా పదిరోజులు జరుగును. చివరినాడు ఉత్తరాషాడ నక్షత్రము అగుటచే ఆనాడు దొడ్డయాచార్యులవారు కొండకు వేంచేసి, నరసింహస్వామికి, అమ్మవారికి మంగళాశాసనమును చేసిన



పిమ్మట స్వామికి, దొడ్డయాచార్యులవారికి అలంకార తిరుమంజనము సమర్పింపబడును. సాయంకాలము స్వామికి, ఆచార్యులకును వీధి ఉత్సవము నిర్వహింపబడిన పిమ్మట దివ్యప్రబంధసేవ, శాత్తుముఱై, తీర్థగోష్ఠి జరుగును. శ్రీమణవాళ మహామునుల తిరువధ్యయనోత్సవము కుంభమాసము కృష్ణద్వాదశినాడు అగుటచే తత్త్రయుక్తముగా ఆ ఉత్సము మూడురోజుల పాటు ఇచట జరుపబడును. శ్రీమణవాళమహామునులు శ్రీరంగనాథునకు ఈడు కాలక్షేపమును అనుగ్రహించుటచే ఆ స్వామికి ఆచార్యులయ్యిరి. అట్లే, ఎఱుమ్బి గ్రామములో భక్తవత్సల స్వామికి తిరుప్పావై కాలక్షేపమును అనుగ్రహించుటచే ఆ స్వామికిని ఆచార్యులయ్యిరి. శ్రీరంగమున తమ ఆచార్యులగు మణవాళమహామునుల అధ్యయనోత్సవమును జరుపవలెనని శ్రీరంగనాథుడు ఆజ్ఞాపించినట్లే, ఇచట కూడ భక్తవత్సలస్వామి తమకు ఆచార్యులగు శ్రీమణవాళమహామునులకు అధ్యయనోత్సవము జరుపవలెనని ఆజ్ఞాపించెను. కావున ఈ ఉత్సవము మూడు రోజులపాటు ఇచట జరుపుబడుచున్నదని పెద్దలయొక్క సూక్తి.

**పంగుని నెల (ఫాల్గునము) :** ఉగాది - తెలుగుసంవత్సరాదినాడు పంచాంగ శ్రవణము, పెద్దకొండపై పంగుని ఉత్తరకల్యాణోత్సమును ఈ నెలలో ప్రధానోత్సవములు. పంగుని ఉత్తరకల్యాణోత్సవమునాడు భక్తవత్సలస్వామి పెద్దకొండకు వేంచేసిన పిమ్మట అమ్మవారి ఉత్సవమూర్తితో కలసి అలంకార తిరుమంజనము కటాక్షించును. పిమ్మట వీథిఉత్సవము, కల్యాణోత్సము, గద్యత్రయగోష్ఠి జరుగును. రాత్రి దివ్యదంపతుల మూర్తులు కలసి వేంచేసి యుండు సేవ, మరునాడు ఉదయము విశ్వరూప సేవకు పిమ్మట భక్తవత్సలస్వామి ఊరిలో దేవాలయమునకు తిరిగి వేంచేయును.



## హంసకృతఘటికాద్రినారసింహస్తుతిః

( ఘటికాచలమాహాత్మ్యే - ఏకవింశోధ్యాయే )

1. దేవదేవ జగన్నాథ కృపాలో భక్తవత్సల ।
ప్రసాదం కురు మే క్షిప్రం ఘటికాచలనాయక ॥

2. హేమకోటిపదాధ్యక్ష హృదయానంద కేశవ ।
భగవన్ భవరోగఘ్న నమ స్తే నృహరే హరే ॥

3. నామరూపాత్మనా విశ్వం విభజ్య పరిపాల్యతే ।
సృజ్యతే నీయతే యేన నమ స్తే నృహరే హరే ॥

4. యస్యాజ్ఞా మవలంబ్యైషో వాయుపుత్ర శ్చతుర్భుజః ।
శంఖచక్రధరో హ్యాస్తే నమ స్తే నృహరే హరే ॥

5. ప్రహ్లాదభక్తవరద వామదేవాదిముక్తిద ।
సప్తర్షిప్రియ సర్వేశ నమ స్తే నృహరే హరే ॥

6. సంసారవైరిన్ దైత్యారిన్ దంష్ట్రిన్ భీమపరాక్రమ ।
ఆపాతాళనభోవాసిన్ నమ స్తే నృహరే హరే ॥

7. సిద్ధ్యంతి సిద్ధయో యస్మా త్సర్వరూపా త్సహస్రశః ।
వేదా శ్చ భూతయ స్సర్వాః నమ స్తే నృహరే హరే ॥

8. విశ్వస్యేశాన మపి యం మతీనాం పురుషర్షభః ।
సంగిరంతే ఘృణా పూర్ణా నమ స్తే నృహరే హరే ॥

## విప్రశేఖరకృతఘటికాద్రినరసింహస్తవః

( ఘటికాచలమాహాత్మ్యే ఏకోనవింశోధ్యాయః )

1. హేమకోటివిమానస్థం జానున్యస్తప్రకోష్ఠకమ్ ।
శంఖచక్రధరం పీతవాసోద్భాసికటీతటమ్ ।
యోగాసనే సమాసీనం కిరీటిన మనామయమ్ ॥



2. దూర్వానీలోత్పలవనశ్యామళం కోమలాకృతిమ్ ।
ప్రసన్నవదనం లక్ష్మీభాసితోరస్క ముజ్జ్వలమ్ ॥

3. నతమర్త్యప్రపన్నార్తిహరిణం వనమాలినమ్ ।
శ్రీవత్సకౌస్తుభధరం చంద్రసూర్యవిలోచనమ్ ॥

4. సింహస్కంధం సింహముఖం ప్రహ్లాదప్రియకారిణమ్ ।
దానవేంద్రవిభేత్తారం కర్తారం జగతా మపి ॥

5. గోప్తారం చ తథా విష్ణుం ప్రణతార మనిందితమ్ ।
దంష్ట్రిణం తం కేసరిణం నరకేసరిణం విభుమ్ ॥

6. సప్తర్షివందితం భీమం గదాధర మధీశ్వరమ్ ।
వ్యక్తాననం మహోరస్కం జ్వాలామాలావిభూషణమ్ ॥

7. షట్కోణమధ్యనిలయ మున్నతశ్రుతి ముద్ధరమ్ ।
ఉదగ్రనాస ముచ్చండకాల ముత్తమమస్తకమ్ ॥

8. వామదేవాది బ్రహ్మర్షిసేవితం శివసేవితమ్ ।
సర్వకామప్రదం వ్యక్త మవ్యక్తం పురుషోత్తమమ్ ॥

9. సింహగామిన మీశానం నిధి మచ్యుత మవ్యయమ్ ।
పింగళాక్షం పృథుగ్రీవం విమలం స్తంభసంభవమ్ ॥

10. ముక్తిదం భుక్తిదం శాంతం దాంత మానందకందళమ్ ।
మందారమాలాభరణ మష్టబాహుం మహోదరమ్ ॥

11. సనకాదినుతం దేవం రాజపూజిత మీశ్వరమ్ ।
సూర్యకోటిప్రతీకాశం చంద్రకోటిసమద్యుతిమ్ ॥

12. శృంగకోటిమహాశైలవాసినం హృది వాసినమ్ ।
హనుమద్వందితం లోకశంకరం శంకరప్రియమ్ ॥

13. భక్తార్చితం యథాభక్తిదాయినం శుభదాయినమ్ ।
సటాలంకృత మవ్యగ్ర ముగ్రశాసన ముద్ధతమ్ ॥

14. విస్తీర్ణవదనం దీనరక్షకం సురరక్షకమ్ ।
జపాకుసుమవర్ణాభం హేమయజ్ఞోపవీతినమ్ ॥

15. ధృతహేమకటీసూత్రం హేమాంగం హేమకుండలమ్ ।
హేమపుష్పమహామాలాపరిష్కృతభుజాంతరమ్ ॥

16. దైత్యరాజవసామాలాభరణం శరణం నృణామ్ ।
ఉత్తమానుత్తమం దేవరాజ మాజానుబాహుకమ్ ॥

17. పోషణం జగతాం భూతభావనం పత్రివాహనమ్ ।
వేదాంతవేద్య మవ్యగ్రం వైఖానససుపూజితమ్ ॥

18. వాలఖిల్యాదియోగీంద్రసంస్తుతం పరమార్థదమ్ ।
మహోక్షం చ హిరణ్యాక్షశిక్షకం భక్తరక్షకమ్ ॥

19. అపరాజిత మక్షోభ్య మనంతం పరమం పరమ్ ।
అనేకరూప మాదిత్యమండలస్థ మకృత్రిమమ్ ॥

20. హిరణ్మయం హిరణ్యాక్షం హిరణ్యశ్మశ్రుకం ప్రభుమ్ ।
నాయకం సురమాలాయా ఘటికాచలనాయకమ్ ॥

21. నమస్కుర్వన్ సదా విప్రశేఖరో విష్ణుభక్తిమాన్ ।
ఏకవింశోత్తరశతం నామ్నాం నరహరే రిదమ్ ॥
చతుర్థ్యంతేన సహితం సమర్చయతి భూపతే ।

## కుబేరకృతామృతఫలవల్లీస్తవః

**( ఘటికాచలమాహాత్మ్యే వింశోధ్యాయః )**

1. అంబ త్వత్సన్నిధానేన కృతార్థోఽహం తథాపరః ।
చరితార్థం చ విజ్ఞానం తథా సందర్శనం సదా ॥

2. అద్య తే పాదపద్మస్య దర్శనా జ్జగదీశ్వరి ।
చరితార్థ మివాత్మానం మన్యే కన్యే పయోనిధేః ॥



3. శ్రీః లక్ష్మీ రిందిరా పద్మా లోకమాతా జనేశ్వరీ ।
పద్మాలయా పద్మహస్తా నిత్యా పద్మప్రియా సతీ ॥

4. యోగినీ సా యోగనిద్రా కమలామాలికా రమా ।
హరిప్రియా సింధుకన్యా పద్మజన్మాఽథ భార్గవీ ॥

5. సర్వకామప్రదా నృణాం మంగళా చేందిరా స్వధా ।
స్వాహా పుష్టి స్తథా తుష్టి స్సర్వకామదుఘా ప్రియా ॥

6. సా తై ర్నామపదై రంబా నిత్యం సంపూజ్యతాం నృభిః ।
కిం కిం న ప్రార్థితా కుర్యా ద్భవతీ హరివల్లభే ॥

## మహేంద్రకృతలక్ష్మీస్తుతిః

**( ఘటికాచలమాహాత్మ్యే సప్తదశోధ్యాయః )**

1. త్వం శ్రీః హ్రీః ప్రియా విష్ణో స్త్వ మీశాని మహేశ్వరి ।
సరస్వతీ త్వ మేకేవ దృశ్యసే నర్తకీవ హి ॥

2. త్వదాశ్రితానాం ప్రభవంతి సంపదః ప్రసన్నభావేన పరై ర్దురాసదాః ।
పురాణవాచో విషయా త్వ మేకికా సంగీయసే వేదవచోభి రాదరాత్ ॥

3. త్వం విశ్వగోప్త్రీ జగతాం జనిత్రీ తథా నిహంత్రీ త్రిగుణాశ్రయా త్వమ్ ।
విష్ణో రురస్సీమనిషేదుషీ త్వం దదాసి పుత్రాం శ్చ తథా ఫలాని ॥

4. కల్పాదయో భూమిరుహా శ్చ చంద్రమా స్సుధా తథా కామగవీమహాప్సరాః।
చింతామణిశ్చ మణి రేవ సముజ్జ్వలశ్రీః సర్వాణ్యమూని తవ సోదరభావభాంజి॥

5. విష్ణో రముష్య త్రిజగత్ప్రణేతు ర్వక్షస్థలే కౌస్తుభరత్నభూషయా ।
సహాధివాసం భవతీవ చ స్మ కరోతి కాలా భువనేషు పద్మే ॥

6. అనాదిభావం గమితాఽపి దుగ్ధపయోనిధౌ జన్మ తథా పయోజే ।
ఇతః పరం జన్మ కుతోఽపి దేవి భావీతి కిం సాదిగణేషు గణ్యా ॥

7. యా మేవ వాగ్భగవతీతి చ చంద్రలేఖామూలేతి శాంతి రితి పుష్టి రితి ప్రమేతి।
ఇష్టి స్తథా మణి రితి ప్రమదేతి విష్ణో స్స్వాహా స్వధేతి విబుధా భవతీం భణంతి ॥

8. హ్రీం క్లీం మితి స్వకమలోపరిసంస్థవర్ణా వాభ్యాం పుటీకృత ముపేత్య విభాతి పద్మే ।
శ్రీం శ్రీ మితి ప్రతిపదం జపతాం త్వదాఖ్యాం కిం నామ భావి న జగత్త్రితయే బుధానామ్ ॥

9. దిగ్దంతి పుష్కరగృహీతనవోదకుంభధారాతినిర్యదుదకప్లవమానదేహామ్ ।
దివ్యాంబరాభరణమాల్యసుగంధధూపదీపోపహారబలిభిః కమలే భజే త్వామ్॥

10. విశ్వామయీతి వచసా మధిదేవతేతి గౌరీతి భూమి రితి దీధితి రిత్యజస్రమ్।
విద్యాకరేతి కమలేతి శచీతి చ త్వాం వ్యాకుర్వతే నిగమవాక్ప్రవరా స్సవిత్రి ॥

11. ఇతి స్తుతా తదా దేవీ లక్ష్మీ రున్నిద్రలక్షణా ।
అదా దభీప్సితం సర్వం తస్మై విబుధస్వామినే ॥

## ఔద్దాలికిమునికృతాంజనేయ స్తోత్రమ్

**( ఘటికాచలమాహాత్మ్యే వింశోధ్యాయః )**

1. మారుతస్యౌరసః పుత్ర ప్రసీదత్వమరిందమ ।
న వై త్వద్వ్యతిరిక్తోఽస్తి స్తోతా నృహరి మీశ్వరమ్ ॥

2. అతిపాటలవక్త్రాబ్జం ధృత హేమాద్రివిగ్రహమ్ ।
ఆంజనేయం శంఖచక్రపాణం చేతసి ధీమహి ॥

3. పారిజాతప్రియో యోగీ హనుమాన్వు హరిప్రియః ।
ప్లవగేంద్రః పింగళాక్ష శ్శీఘ్రగామీ దృఢవ్రతః ॥

4. శంఖచక్రవరాభీతిపాణి రానందదాయకః ।
స్థాయీ విక్రమసంపన్నో రామదూతో మహాయశాః ॥

5. సౌమిత్రిజీవనకరో లంకావిక్షోభకారకః ।
ఉదధిక్రమణ స్సీతాశోకనాశకరో హరిః ॥



6. బలీ రాక్షససంహర్తా దశకంఠమదాపహా ।
బుద్ధిమా న్నైఋుతవధూకంఠసూత్రవిదారకః ॥

7. సుగ్రీవసచివో భీమో భీమసేనసహోదరః ।
సావిత్రివిద్యాసంసేవీ చరితార్థో మహోదరః ॥

8. వాసవాభీష్టదో భవ్యో హేమశైలనివాసవాన్ ।
కింశుకాభో వ్యగ్రతనూ ఋజురోమా మహామతిః ॥

9. మహాక్రమో వనచరః స్థిరబుద్ధి (రభీశుమాన్) ?।
సింహికాగర్భనిర్భేత్తా భేత్తా లంకానివాసినామ్ ॥

10. అక్షఘ్న శ్శత్రునిఘ్న శ్చ రక్షోమాత్యభయాపహా ।
వీరహా మృదుహస్త శ్చ పద్మపాణి ర్జటాధరః ॥

11. సర్వప్రియ స్సర్వకామప్రదః ప్రాంశుముఖ శ్శుచిః ।
విశుద్ధాత్మా విజ్వర శ్చ సటావాన్ పాటలాధరః ॥

12. భరతప్రేమజనకో చీరవాసా మహాక్షధృక్ ।
మహాస్త్రబంధనసహః బ్రహ్మచారీ వ్రతేశ్వరః ॥

13. మహౌషధోపహర్తా చ వృషపర్వా వృషోదరః ।
సూర్యోపలాలిత స్స్వామీ పారిజాతావతంసకః ॥

14. సర్వప్రాణధరోఽనంత స్సర్వభూతాతిగో మనుః ।
రౌద్రాకృతి ర్భీమకర్మా భీమాక్షో భీమదర్శనః ॥

15. సుదర్శనకరో వ్యక్తో వ్యాత్తాస్యో దుందుభిస్వనః ।
సువేలచారీ మైనాకహర్షదో హర్షణప్రియః ॥

16. సులభ స్సువ్రతో యోగీ యోగిసేవ్యో భయాపహా ।
వాలాగ్నిమథితానేకలంకావాసిగృహోచ్చయః ॥

17. వర్ధనో వర్ధమాన శ్చ రోచిష్ణూ రోమశో మహాన్ ।
మహాదంష్ట్రో మహాశూర స్సద్గతి స్సత్పరాయణః ॥

18. సౌమ్యదర్శీ సౌమ్యవేషో హేమయజ్ఞోపవీతిమాన్ ।
మౌంజీకృష్ణాజినధరో మంత్రజ్ఞో మంత్రసారధిః ॥

19. జితారాతిషడూర్మి శ్చ సర్వప్రియహితేరతః ।
ఏతై ర్నామపదై ర్దివ్యై యః స్తౌతి తవ సన్నిధౌ ॥

20. హనూమం స్తస్య కిన్నామ నో భవే ద్భక్తిశాలినః ।
ప్రణవం చ పురస్కృత్య చతుర్థ్యంతై ర్నమోంతకైః ॥

21. ఏతై ర్నామభి రవ్యగ్రై రుచ్యతే హనుమాన్ భవాన్ ।
వ్రణరోగాదిదారిద్ర్యం పాపక్షుదపమృత్యవః ॥

22. వినశ్యంతి హనూమం స్తే నామ్నాం సంకీర్తనక్షణే ।
భగవన్ హనుమ న్నిత్యం రాజవశ్యం తథా సతాం ॥

23. లక్ష్మీవశ్యం చ స్త్రీవశ్య మారోగ్యం ధైర్య్య మాయుషః ।
ప్రాధాన్యం సకలానాం చ జ్ఞాతిప్రాధాన్య మేవ చ ॥

24. వీర్యం తేజ శ్చ భక్తానాం ప్రయచ్ఛసి మహామతే ॥





# శ్రీ మంత్రరాజపదస్తోత్రమ్

పార్వత్యువాచ

1. మంత్రాణాం పరమం మంత్రం గుహ్యానాం గుహ్యముత్తమమ్ ।
బ్రూహి మే నారసింహస్య తత్త్వం మంత్రస్య దుర్లభమ్ ॥

పార్వతి ఈ విధంగా అన్నది.

మంత్రాలలో గొప్ప మంత్రం, రహస్యాలలో గొప్పదైన రహస్యం, లభించడానికి సాధ్యంకానిది అయిన నరసింహమంత్రంయొక్క తత్త్వాన్ని నాకు తెలియజేయాలి.

2. వృత్తోత్ఫుల్లవిశాలాక్షం విపక్షక్షయదీక్షితమ్ ।
నినాదత్రస్తవిశ్వాండం విష్ణుముగ్రం నమామ్యహమ్ ॥

గుండ్రని, బాగా వికసించిన, విశాలమైన నేత్రాలను కలవాడు (అటువంటి నేత్రాలతో భక్తులను కటాక్షించేవాడు), భక్తుల శత్రువులను నిరసించడాన్ని దీక్షగా కలవాడు, దానికి అనుగుణంగా వీరనాదాన్ని చేసినపుడు ఆ ఘోషతో బ్రహ్మాండాన్ని అంతటిని భీతిల్లజేసినవాడు, (భక్తరక్షణార్థం) అంతటా వ్యాపించి ఉన్నవాడు, (శత్రుసంహారసమయంలో తనను చూచిన శత్రువులు) "ఏమి ఈ ఉగ్రమైన రూపం"- అని భయపడే రీతిలో ఉగ్రరూపాన్ని కలవాడు అయిన శ్రీనృసింహస్వామికి నమస్కరిస్తున్నాను.

3. సర్వైరవధ్యతాం ప్రాప్తం సబలౌఘం దితేః సుతమ్ ।
నఖాగ్రైః శకలీచక్రే యస్తం వీరం నమామ్యహమ్ ॥

భగవానుని సృష్టిలోని ఎవరిచేతను వధింపబడని రీతిలో వరాన్ని పొందినవాడు, దితికుమారుడు అయిన హిరణ్యకశిపుని కేవలం తన నఖాల అగ్రాలతో ఖండించినవాడు, ఏ రీతిలో కలతను (భీతిని) పొందని సాటి లేని మేటి వీరుడైన నృసింహునకు నమస్కరిస్తున్నాను.

4. పదావష్టబ్ధపాతాళం మూర్ధావిష్టత్రివిష్టపమ్ ।
భుజప్రవిష్టాష్టదిశం మహావిష్ణుం నమామ్యహమ్ ॥

పాతాళంలో శ్రీచరణాలను, దేవలోకంలో శిరస్సును, ఎనిమిది దిక్కులలో భుజాలను కలవాడై, ముల్లోకాలను తన విశ్వరూపంతో వ్యాపించి నిలచి, అందువల్ల మహావిష్ణువు అనే తిరునామానికి లక్ష్యభూతుడైన శ్రీనృసింహభగవానునకు నమస్కరిస్తున్నాను.

5. **జ్యోతీంష్యర్కేందునక్షత్ర జ్వలనాదీన్యనుక్రమాత్ ।**
**జ్వలంతి తేజసా యస్య తం జ్వలంతం నమామ్యహమ్ ॥**

సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, అగ్ని మొదలైన వస్తువులు ఏ భగవానుని అనుగ్రహంయొక్క ఏకదేశం (అత్యల్పభాగం)వల్ల ప్రాప్తించిన తేజస్సులో ప్రకాశిస్తున్నవో (జ్వలిస్తున్నవో), అటువంటి పరమాత్మస్వరూపమైన జ్వలించే శ్రీనృసింహభగవానునకు నమస్కరిస్తున్నాను.

**"యస్య భాసా సర్వమిదం విభాతి"** ఇత్యాది శ్రుత్యర్థం ఇక్కడ అనుసంధింప బడింది.

6. **సర్వేంద్రియైరపి వినా సర్వం సర్వత్ర సర్వదా ।**
**జానాతి యో నమామ్యాద్యం తమహం సర్వతోముఖమ్ ॥**

జీవులందఱు పంచేంద్రియాలద్వారా లోకంలోని పదార్థాలనుగూర్చిన జ్ఞానాన్ని పొందుతున్నారు. కాని, ఏ ఇంద్రియంయొక్క సహాయం లేకుండానే అన్నిటిని అన్నిచోట్ల ఎల్లప్పుడు స్వయంగా తెలిసికొనేవాడు, కనుకనే సర్వతో ముఖుడనే తిరునామాన్ని కలవాడైన ఆ నృసింహభగవానునకు నమస్కరిస్తున్నాను.

7. **నరవత్ సింహవచ్చైవ రూపం యస్య మహాత్మనః ।**
**మహాసటం మహాదంష్ట్రం తం నృసింహం నమామ్యహమ్ ॥**

తన భక్తులపట్ల పరమోదారుడైన భగవానుడు ఆ భక్తులను రక్షించే నిమిత్తం స్వీకరించిన నృసింహరూపం భక్తులు దరి చేరేటట్లు, వారి విరోధులు భయపడి పరుగుదీయడానికి తగినట్లు ఉన్నది. ప్రాణుల రూపాలలో గొప్పదైన మానవ రూపంతో, విరోధులను తత్క్షణమే నిరసించగల్గినవాడితడు- అని తెలుపడం కోసం ఆ విరోధులకు భయంకరమైన సింహరూపంతో కూడినది, గొప్ప సటలతో



కూడినది, గొప్ప దంష్ట్రలను (కోరపళ్ళను) కల్గినది, ఇచ్ఛాగృహీతమైనది, అభిమతమైనది అయిన గొప్ప రూపాన్ని పొందిన ఆ నృసింహభగవానునకు నమస్కరిస్తున్నాను.

8. **యన్నామస్మరణాద్భీతాః భూతవేతాళరాక్షసాః ।**
**రోగాద్యాశ్చ ప్రణశ్యంతి భీషణం తం నమామ్యహమ్ ॥**

ఏ నృసింహభగవానుని తిరునామాన్ని స్మరించినంతలోనే భూతాలు, భేతాళవర్గాలు, రాక్షసులు - అనే బాహ్యవిరోధులు, రోగాలు మొదలైన లోపలి విరోధులు అవి ఉన్న చోటు తెలియని రీతిలో నశించిపోతాయో, భీషణశబ్ద వాచ్యుడైన ఆ నృసింహభగవానుని నమస్కరిస్తున్నాను.

9. **సర్వేఽపి యం సమాశ్రిత్య సకలం భద్రమశ్నుతే ।**
**శ్రియా చ భద్రయా జుష్టః యస్తం భద్రం నమామ్యహమ్ ॥**

లోకంలో అందఱు ఏ భగవానుని ఆశ్రయించి సకలక్షేమాన్ని పొందుతున్నారో, అందరికి క్షేమాన్ని కల్గించడంవల్ల, భద్రశబ్దవాచ్య అయిన లక్ష్మీదేవిచే నిత్యం ఆశ్రయింపబడినవాడు, భద్రశబ్దవాచ్యుడైన ఆ నృసింహభగవానునకు నమస్క రిస్తున్నాను.

10. **సాక్షాత్ స్వకాలే సంప్రాప్తం మృత్యుం శత్రుగణానపి ।**
**భక్తానాం నాశయేద్యస్తు మృత్యుమృత్యుం నమామ్యహమ్ ॥**

విష్ణుభక్తులు యమభటులకు వశ్యులు కారనే వాస్తవాన్ని గుర్తించని యముడు వారి దేహావసానసమయంలో వారివద్దకు సాక్షాత్తుగా తానే వచ్చినా, అతనిని, (కామక్రోధాదుల రూపంలోని అంతః) శత్రువులను సంహరించి అనుగ్రహిస్తాడో, మృత్యువుకు మృత్యువైనవాడు, అందువల్లనే **"మృత్యుమృత్యు"** పదవాచ్యుడైన ఆ శ్రీనృసింహభగవానునకు నమస్కరిస్తున్నాను.

11. **నమస్కారాత్మకం యస్మై విధాయాత్మనివేదనమ్ ।**
**త్యక్తదుఃఖోఽఖిలాన్ కామానశ్నుతే తం నమామ్యహమ్ ॥**

ఏ భగవానునివద్ద శరణాగతి అనే ఆత్మరక్షాభరసమర్పణాన్ని చేసి, తన్మూలంగా సమస్తదుఃఖాలు తొలగినవాడై సకలపురుషార్థాలను జీవుడు పొందుతున్నాడో, ఆ శ్రీనృసింహభగవానుని శరణు పొందుతున్నాను.

12. దాసభూతాస్స్వతః సర్వే హ్యాత్మానః పరమాత్మనః ।
అతోఽహమపి తే దాస ఇతి మత్వా నమామ్యహమ్ ॥

సకలచేతనులు, పరమాత్మకు సహజంగానే దాసులు. అందువల్ల, వారిలో ఒకడనైన నేనుకూడా, ఓ నృసింహస్వామీ! నీకు దాసుడను - అని తలచి, శేషత్వజ్ఞానపూర్వకంగా నిన్ను శరణు పొందుతున్నాను.

13. శంకరేణాదరాత్ ప్రోక్తం పదానాం తత్త్వముత్తమమ్ ।
త్రిసంధ్యం యః పఠేత్ తస్య విద్యాఽఽయుః శ్రీశ్చ వర్ధతే ॥

ఈ విధంగా మంత్రరాజపదాలలోని వాస్తవార్థం శ్రీశంకరునిచే (పరమేశ్వరునిచే) చాలా ఆదరంగా వివరింపబడింది. దీనిని సాయంవేళ, మధ్యాహ్నసమయంలో, సాయంకాలంలోను పఠించేవారికి సద్విద్య, ఆయుస్సు, సంపద వృద్ధిజెందుతుంది.

# ఋణవిమోచన స్తోత్రమ్

1. దేవతాకార్యసిద్ధ్యర్థం సభాస్తంభసముద్భవమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

దేవతల కార్యసిద్ధికోసం హిరణ్యకశిపుని సభలోగల స్తంభంనుండి ఉద్భవించినవాడు, మహావీరుడు అయిన శ్రీనృసింహస్వామిని ఋణవిముక్తికోసం నమస్కరిస్తున్నాను.

2. లక్ష్మ్యాఽఽలింగితవామాంకం భక్తానాం వరదాయకమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

లక్ష్మీదేవిచే ఆలింగనం చేసికోబడిన వామాంకాన్ని కలవాడు, భక్తులకు వరాలను ఇచ్చేవాడు, మహావీరుడైన శ్రీనృసింహస్వామిని ఋణవిముక్తికోసం నమస్కరిస్తున్నాను.



3. ఆంత్రమాలాధరం శంఖచక్రాబ్జాయుధధారిణమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

హిరణ్యకశిపుని (వధించి అతని) పేగులను మాలగా దాల్చినవాడు, ఆయుధాలను ధరించినవాడు, మహావీరుడైన శ్రీనృసింహస్వామిని ఋణవిముక్తికోసం నమస్కరిస్తున్నాను.

4. స్మరణాత్ సర్వపాపఘ్నం కద్రూజవిషనాశనమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

(తనను) స్మరణచేయడంవల్ల అన్ని పాపాలను పోగొట్టేవాడు, సర్పవిషాన్ని నశింపజేసేవాడు, మహావీరుడైన శ్రీనృసింహుని ఋణవిముక్తికోసం నమస్కరిస్తున్నాను.

5. సింహనాదేన మహతా దిగ్దంతిభయనాశనమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

తన సింహనాదంతో దిగ్గజాల భయాన్ని తీర్చేవాడు, మహావీరుడు అయిన శ్రీనృసింహస్వామిని ఋణవిమోచనార్థం నమస్కరిస్తున్నాను.

6. ప్రహ్లాదవరదం శ్రీశం దైత్యేశ్వరవిదారణమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

ప్రహ్లాదునకు వరాలను ప్రసాదించినవాడు, లక్ష్మీపతి, దైత్యప్రభువైన హిరణ్యకశిపుని సంహరించినవాడు, మహావీరుడు అయిన శ్రీనృసింహస్వామిని ఋణవిముక్తికోసం ప్రార్థిస్తున్నాను.

7. క్రూరగ్రహైః పీడితానాం భక్తానామభయప్రదమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

క్రూరగ్రహాలవల్ల పీడింపబడిన భక్తులకు అభయాన్ని ఇచ్చేవాడు, మహావీరుడైన శ్రీనృసింహస్వామిని ఋణవిముక్తికోసం ప్రార్థిస్తున్నాను.

8. వేదవేదాంతయజ్ఞేశం బ్రహ్మరుద్రాదివందితమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

వేదవేదాంతాలకు, యజ్ఞాలకు ప్రభువు, బ్రహ్మరుద్రుడు మొదలైన దేవతలచే నమస్కరింపబడేవాడు, మహావీరుడైన శ్రీనృసింహుని ఋణవిముక్తికోసం ప్రార్థిస్తున్నాను.

**9. య ఇదం పఠతే నిత్యం ఋణమోచనసంజ్ఞితమ్ ।**
**అనృణీ జాయతే సద్యో ధనం శీఘ్రమవాప్నుయాత్ ॥**

ఋణవిమోచనమనే పేరును కల ఈ స్తుతిని నిత్యం ఎవడు పఠిస్తాడో, అతడు ఋణం తీరినవాడై, శీఘ్రంగా ధనాన్ని పొందుతాడు.



# శ్రీనృసింహ గాయత్రీ మంత్రము

వజ్రనఖాయ విద్మహే । తీక్ష్ణదంష్ట్రాయ ధీమహి ।
తన్నో నారసింహః ప్రచోదయాత్ ॥

# శ్రీనృసింహానుష్టుప్

ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖమ్ ।
నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్ ॥

